శ్రీ మత్పరదేవతాయైనమః.

# నలమహారాజుకథ



(వచన కావ్యము)

గ్రంథకర్త:
సహస్రావధాని
జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి



ప్రకాశకులు:
కొండా శంకరయ్య
పుస్తకముల వ్యాపారము
సికింద్రాబాద్ :: వరంగల్.



వెల 1—0—0

1950

# హెచ్చరిక

ఈ నలమహారాజుకథయొక్క సర్వాధికారములను మేము పొందియున్నారము. కావున ఈ గ్రంథమును యితరులు యిదే విధముగా గాని, మార్పుచేసిగాని ముద్రించినయెడల మేము చేయబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులై యుండగలరు.

ఇట్లు
కొండా శంకరయ్య,
పుస్తకముల వ్యాపారము,
సికింద్రాబాద్.

ప్రీమియర్ ప్రెస్, సికింద్రాబాద్.

# విజ్ఞాపన

మహాశయులారా!

సత్యాహింసలకు తావులేని నేటి కల్లోల భారతములోనే మున్నొకప్పుడు షట్చక్రవర్తులు జన్మించినారు. అట్టి షట్చక్రవర్తులలో నలుఁ డొకఁడు. మహీసామ్రాజ్యమును తన న్యాయసూత్రాలతో నింప సత్యకంకణముఁ గట్టుకొన్న నలుని చరిత్ర మనకు యవశ్యపఠనీయము

ధర్మ నిరతి నెరపుటకై సర్వ మహీతలము పుష్కరునకు విడచి దారపుత్రాదులతో యరణ్యవాసము జేసి కలిమాయచే భార్య కోక సైతము రెండుగా చీల్చి కట్టుకొని, ఆకటికి అలమటించి, భార్యాపుత్రాదుల విడచి, తుదకు వంటవాడై సత్య యశంబుగొన్న యా వీర నలుని చరిత్ర "శృంగార నైషధము"ను పేర శ్రీనాథుడును, "చిత్ర నళీయము"ను పేర దృశ్యప్రబంధముగా ధర్మవరము కృష్ణమార్యులు గారును రచించి లోకమున కందించినారు. అవి యావత్తు పల్లెపట్టులందు పామర జనమునకు గ్రాహ్యము గా కునికి సులభ శైలిలో, నేటి తెలుగు నుడికారముతో వ్రాసి, స్త్రీ పురుషులకు, బాల బాలికలకు దెలియునట్లు ఈ నలమహారాజు కథను గద్యముగా రచించినాడను. ఇందలి తప్పొప్పులను గుణగ్రహణ పారీణులగు చదువరులు మన్నించ ప్రార్థన.

గ్రంథకర్త.



# ఉపోద్ఘాతము



నలచక్రవర్తి చరిత్రమను ఈ కావ్యము పరిమాణమునకు జిన్నదైనను, ప్రాముఖ్యమునకు చాల గొప్పది. మా సంస్థనుండి వెలువడు గ్రంథములు కొన్ని భాషా ప్రాముఖ్యము గలిగినవియు, గొన్ని నీతి, ధర్మబోధయే ప్రాముఖ్యములుగా గలవియునై యున్నవి. అందు ఈ నలచక్రవర్తి చరిత్ర మను వచన కావ్యము సత్యధర్మములను బోధించునది.

ఇందు నలచక్రవర్తి దార్కాణముగా దీసికొనిన పురుషులకు సత్యధర్మము లవసరములని నీతి బోధింపబడుచున్నది. దమయంతిని దార్కాణముగా దీసికొనబడినస్త్రీలకు పాతివ్రత్య మవసరమని బోధింపబడుచున్నది. వేటాడుట, జూదమాడుట వ్యభిచరించుట, దొంగతనము మొదలగు వృత్తులు అనిష్టదాయకములని యుద్బోధింపబడినది. దైవభక్తికి ఈ గ్రంథమున ముఖ్యస్థానము కలదు. కష్టములు గలిగినప్పుడు మానవులు నలదమయంతులవలె సహనశీలమును, ధైర్యసాహసములును గలిగి, పరమేశ్వర ధ్యానముచేసి తమ ప్రవర్తననైర్మల్యమునుగాపాడుకొనవలయునని నీతి బోధింపబడుచున్నది. అందువలన నీ గ్రంథము స్త్రీపురుషుల కందఱకును ముఖ్యముగాఁబఠనీయమైనది. సమయానుకూలముగను, రసానుకూలముగను జదువరుల యుత్సాహముకొఱకు కొన్ని పద్యములును నందందు సమకూర్పబడినవి.

లేఖన ముద్రణాది దోషములను పరిత్యజించి గ్రంథలేఖనాశయమును గ్రహించి యాంధ్రలోకము మా యుద్యమమును బ్రోత్సహింతురని ప్రార్థించుచున్నారము.

ఇట్లు,

ప్రకాశకులు.



# విషయసూచిక

—:౦:—

శ్రీ

# నలమహారాజు కథ

## 1. బృహదశ్వమహాముని పాండవుల పర్ణశాల కేతెంచుట.

క॥ శ్రీ లాలిత గజవదనా
శైలసుతా ప్రియతనూజ, జగదభివంద్యా
కేలొగ్గిన భక్తుల వి
ఘ్నాళిన్ సమయించి యేలుమయ్యా గణేశా.

ద్వాపరయుగమున శ్రీమహావిష్ణువు దేవకీవసుదేవులకు జన్మించి శ్రీకృష్ణ స్వరూపంబున జగద్రక్షణము, ధర్మరక్షణము సేయు కాలమున చంద్రవంశజనితుల నుపాండురాజకుమారులుననగుపాండవులుతమదాయా దుగను ధృతరాష్ట్రుని సంతతియునగు దుర్యోధనాదుల దౌష్ట్యము కారణ ముచేఁ బండ్రెండు సంవత్సరములు అరణ్యావాసముసేసి రను విషయము జగద్విదితమైనది. ఆ వనవాసకాలమున ధర్మబద్ధులగు పాండవులు, తొలుత కామ్యవనాదులం దిరిగి పుణ్యక్షేత్రములు పెక్కులు సేవించి, కడపటి భాగమున ద్వైతవనంబున నొక్క పర్ణశాల నిర్మించుకొని శ్రీ కృష్ణుని యనుగ్రహమున సుఖముగఁ గాలము గడపుచుండిరి. పాండవు లను వనవాస కాలముననే యెట్లో అంతమొందించవలయునని దుర్యో ధనుడు దురాలోచనలు సేసి పలురీతుల యిడుమలపాలుచేసెను. శ్రీ కృష్ణు డెప్పటి కప్పుడు ధర్మస్వరూపుల పక్షమున నుండువాడగుటచే పాండవులకుఁ దోడునీడగ నుండి వారి యిక్కట్టులన్నిటినుండి వారికి బ్రాణాపాయము లేకుండఁ జేసెను. ద్రౌపదీసమేతులయిన పాండవులు తాము పడిన కష్టములవలన నధిక జ్ఞానమును ధర్మతత్పరత్వమునుసంపా దించిరి. కాని తొలుతటి యాయాసమును బట్టి విచారించి ద్వైతవన

మ్మునఁ జేరినది మొదలు కొంత సంతృప్తియు ధైర్యమునుబొంది మహానీయుల సేవ జేయుచు బుణ్యకథలను వినుచు గాలము పుచ్చుచుండిరి.

అట్టియెడ నొక్కనాఁడు బృహదశ్వమహాముని, మే నెల్ల విభూదిచే నలంకరించుకొని జటావల్కలాజినముల దాల్చి, రుద్రాక్షమాలల ధరియించి, పలుమంది శిష్యగణమ్ము లిరుదెసలనిరంతర సేవా కుతూహలులై యుండఁ బాండవులుండు పర్ణశాల కరుగుదెంచెను. ధర్మరాజాదులామహాత్మునకు సముచిత సత్కారముల గావించి, యుచితాసనమునఁ గూర్చుండబెట్టి కుశలప్రశ్నములం గావించుచు దమరును దమ శిష్యగణంబును సుఖమ్ముగ నున్నవారలా యనిరి.

అంత నమ్మహాముని, "పాండునందనా! మము బోటి జడదారులకు సుఖదుఃఖముల తారతమ్యములేదు. ధర్మతత్పరులగు మీవంటి పుణ్యశీలుర నీక్షించుట మాకానందదాయకము. ఆ యానందమే మాకు సుఖప్రాయకము. తద్ప్రాప్తిచే నేనును నా శిష్యగణంబును, సుఖముగనే యున్నారము" అని జెప్పి. "నీవును నీ సహోదరులును సౌఖ్యముతో నున్నారు గదా!" యని ప్రతి ప్రశ్నము గావించెను.

"స్వామీ! మా సౌఖ్యము లేమని తెలుపవలయును? కాని మహామునుల యానతి యగుటచే కొంచెము వివరించి చెప్పెదను. చిత్తగింపగలరు. కౌరవులు యజ్ఞమున కని పేరుపెట్టి మమ్మాహ్వానించి ద్యూతము నాడవలయునని మొదలుపరచిరి. మాయాద్యూతచతురుండగు శకుని సహాయమున మా రాజ్యము నెల్ల గుంజుకొని ద్రౌపదిని సైత మవమానించిరి. మే మరణ్యవాసము పండ్రెండేండ్లు చేయవలయుననిరి. ఒక సంవత్సర మజ్ఞాతవాసము సేయవలయుననిరి. శ్రీకృష్ణుని సాహాయ్యమున నెటులో వారి బారినుండి తప్పుకొని ఈ యడవులం జేరితిమి. ఇచ్చట నెండ యనియు వాన యనియు విచారింపక యీపర్ణశాలలో నివసించుచు, మా ప్రాణముల నపహరింపవలయునని మాకు దెచ్చిపెట్టు నిక్కట్టులను నా శ్రీకృష్ణుని సహాయమువలన దాటుచు నిట్లు దిన మొక యేడుగా గడపుచున్నారము. బంధుగుల నెడఁబాసితిమి. మిత్రులకు దూరస్థులమయితిమి. అవక్రపరాక్రమసంపన్నులగు నాతమ్ములునునన్ను సరించి జడదారులవలె నడవుల నిడుములే గుడుచుచున్నారు. మా యమ్మ కుంతీదేవి షడ్రసోపేతముగ పాకము సేసి మాకొసంగుచుండెడి

రాజభోజనము లెట్లుండెడివో మఱచినారము. దుంపలు, మూలములు, కాయలు, ఫలములు మున్నగు నాటవిక పదార్థములే యిప్పటి మా భోజ్య పదార్థములు. హంసతూలికాతల్పములయందు శయనించుచుండిన నాసహోదరులు, నేడు కఱకు రా నేలలఁ బండుచున్నారు. విపంచికాది వాద్యవిశేషముల మనోహర మధురస్వరంబుల నాలించిన నాతమ్ముల శ్రవణములకు నేడు కుక్కల యఱపులును నక్కలకూతలును సోకు చున్నవి. అక్కటా! యిట్టి వైపరీత్యమున గుందునట్టివారు మేము గాక మఱెవ్వరైన గలరా?" అని కన్నీరు గార్చి విలపించిన ధర్మనందనుని బృహదశ్వమహాముని యిట్లు భాషించెను.

"సకల ధర్మములను నెఱింగియు నేమియు దెలియని పామరుని వలెఁ బరిసంగించెదవేల? ఈ పరితాపమేల? ఇదియంతయు నదైర్య పర్యవసానము. కొంచె మిటు వినుము. నీవే పరిస్థితిలోనున్నావో చెప్పె దను వినుము. నీ పురాకృతపుణ్యఫలంబుగ నీ సోదరులు నీ చెంత నున్నారు. నీ భార్య నీచెంతనుండి నీకు బరిచర్య సేయుచున్నది. పలు వురు భూసురపుంగవులు సత్యధర్మప్రబోధకంబులగు నితిహాసములు చరి త్రలు వినిపించుచున్నారు. దినదినంబును బుణ్యనదీస్నానంబు లభించు చున్నది. మహారణ్యమధ్యమునసుండియు, బురంబునకంటె నెక్కుడు సుఖ ముగ నున్నాడవు. ఈ పరిస్థితిగల వనవాసమునే కష్టముగ దలపోయు నీవు పూర్వరాజులు బడిన కష్టములను వినుచో నచ్చెరువుపడగలవాడవు. హస్తినాపురంబున నీపర్ణశాలయందున్న సౌఖ్యముకంటె నెక్కువ సౌఖ్యము గలదా? ఇట్టి సుఖపరిస్థితిలోనుండి దుఃఖమయ పరిస్థితిలో నున్నట్లు వాపోవుట నీవంటి ధీరులకు సముచితముగాదు. పూర్వము నల చక్రవర్తి యెట్టి సుఖశాలియై యుండెనో, యెట్టి కష్టముల ననుభ వించెనో చెప్పెదను. ఇంచుకంత యాలకింపుము. నీ మనోబాధ తీర గలదు" అని పల్కి బృహదశ్వమహాముని ధర్మనందనునకు నలచక్రవర్తి చరిత్రమును జెప్పఁదొడంగెను.

## 2. నిషధరాజ్యాభివర్ణనము.

చతుస్సముద్రవేలావలయితంబయిన భూమిసాధ్వికిఁ గంఠహార తరళాయమానంబై నిషధదేశాంతర్గతంబగు మహావిందపురము విరాజిల్లు

చుండెడిది. ఆ నగరముయొక్క సౌందర్యము వర్ణనాతీతము. అందలి వీధులన్నియును రథోత్సవసమయములయందు నొక్కుమ్మడి మూడు రథములు ఏకదిశాముఖమున నొకదానిప్రక్క నొకటిగానుండి యూరేగ గలిగిన తటి వైశాల్యముగలవి. చతుష్పథములయందు నన్నిటనునడుమ మంటపము లేర్పరచబడినవి. వాని కంబములు పవడములతో సమకూర్చ బడినవి. కొలువుకూటములు చంద్రికాంత శిలలతో నమర్చబడినవి. వీధులందు పచ్చని తోరణములును, విద్యుచ్ఛక్తిపోషితములగు దీపములును గలిగియుండెను. నగరమునందు పెక్కు మైదానములును, వాని యందు వాపీకూపతటాకములును, మనోహర సౌరభసమంచితములగు లతాంతపుంజంబులతో బ్రకాశించు కేళీవనంబులును గలిగి వెలుగొందుచుండెను. నగరము చుట్టును గజలంఘనములకైన నవకాశ మీయని పరిఖాప్రాకారములుండెను. రథగజతురంగ సముదయంబులు, సేనానాయకులు, తత్తదనుకూలములగు శాలలు పెక్కుతావుల విలసిల్లుచుండెను. ఆ నగరమున పెనుమైదానములచుట్టును, నుద్యానవనములయందులను గల తరువులు అతి దీర్ఘములైన శాఖలు గలిగి, గగనలక్ష్మీచుంబనాసక్తి గలిగినవానివోలె నగపడుచుండెడివి. ఆ పురాన గాపురాలు సేయు పారులు నిగమోచ్ఛారణమున జలజసంభవుని దెగడెడివారు. రాజన్యులు పగతురకు వెన్నిచ్చి యెఱుంగనివారు. బేరులు ఖర్వమహాఖర్వసంఖ్యలచే ద్రవ్యమును గణించుచు బొక్కసముల నింపువారు. అందలి నాలవజాతివారు నేల దుక్కి దున్ని పండించిన ధాన్యరాసులచే నమృతాకరుని సంచారమార్గము నిరోధించువారు. ఆ నగరినుండుపుణ్యశీలల పాతివ్రత్యాది ధర్మములును, రంభాదిదేవకన్యల సౌందర్యము ధిక్కరింప నధికారముగల యందమున నలరారు యువతీరత్నముల యారతిపళ్లెరముల మంగళాచరణ వైభవంబుల దేలు సహజ ధర్మములును, శ్రవణానందకరములు. నగరవాసులు సదా ధర్మైకశీలురై యుండిరి. దయాదాక్షిణ్యములును బరోపకార ప్రసక్తియు వారికి నైజగుణములు. దాసదాసీజనంబులు దొసంగులేని వినయముతో సేవించుచుండ నా రాజ్యపాలనము సేయుచున్న వీరసేనచక్రవర్తి లోకోపకారియనియు, సత్యధర్మపరాయణుడతి ప్రసిద్ధికెక్కెను. అతఁడు సంతానార్థమై పరమేశ్వరుని గూర్చి తపం బొనరింప, ధర్మస్వరూపియగు కుమారు డుదయిం

చెను. ఆతనికి నలుడను పేరొసంగబడెను. వయసు రానా కుమారుండు నిషధదేశమునకుఁ బ్రభువుగఁ బట్టాభిషిక్తుండయ్యెను. నలుని రాజ్యపరిపాలనమునఁ బ్రజలు రాజాజ్ఞకు లోఁబడి, వారు పండించిన ధాన్యమున బదింట నొకభాగము ప్రభువునకుఁ బన్నుగా నొసంగుచుండిరి. నలుడు శ్రీహరిభక్తుడై యిందునిచే నొసంగఁబడిన యొక ధర్మనిర్వాహకమైన చక్రమును ముందుబెట్టుకొని ధర్మైకాయత్తచిత్తముతోను, న్యాయప్రధాన బుద్ధిప్రభావముతోను రాజ్యమేలుచుండెను.

## 8. ధర్మచక్రము వ్యాఘ్రశీర్షమును ఖండించుట.

నలచక్రవర్తి రాజ్యపాలనము సేయు కాలమున ధర్మము నాల్గు పాదముల నడచుచుండెను. సహజ శాత్రవముగల జంతువులైనను పరస్పర వైషమ్యము మాని, నొక్క రేవున నీరు ద్రావుచుండెను. ఒక దినమున నొక వృషభమును, బెబ్బులియు నడవి నడుమగల యొక పెద్ద తటాకమున నొక్క రేవున నీరు ద్రావ వచ్చెను వృషభము మోకాటి బంటి నీటిలో నిల్చి నీరు ద్రావుచు, దాని వాలము కొన నీటి కానుకతమునఁ బైకి ద్రిప్పుకొనెను, వాలము ద్రిప్పునప్పుడు కొన నీరు చింది ప్రక్కనున్న బెబ్బులిపైఁ బడెను. అయ్యెడ శార్దూలము కోపముబూని, గుర్రుజేసి, యా బలీవర్దమును జూచి, "ఓయీ! వృషభమా! యరణ్యమధ్యమున శాద్వలతలంబులం గల పచ్చిక బయళ్ళలోఁ గడుపారఁగ గసవు మెసవి, మదించి, మన్ను మిన్నుగానక సంచరించుచుంటివా? తినినప్పటినుండియు మెడమీదఁగాడిబెట్టుకొని బరువుబండ్లనీడ్చు కృత్యములేక నీ వింత పొగరుపట్టినావు, వాలమును నీటిలో దడిసి నా పైకి నీళ్లు విసరుచున్నావా? దోమలు దోలుకొనుటకు బరమాత్మ నీ కిచ్చిన వాలముతో, బెద్దపులులను దోలు ధైర్యసాహసముల నార్జించితివా? మేలు మేలు. వన్యమృగములలో నగ్రగౌరవము పొందుచున్న మాజాతియందు మీకు నిర్లక్ష్యభావమును గల్పించినవాడు నలమహారాజు. ఏమి ఈతని పరిపాలనా విరుద్ధపద్ధతి. ఇట్టి యక్రమదోషప్రచారకు డెంతకాలము రాజ్యపీఠమున నుండగలడు? ఈతని వంశజులెందఱో యీ రాజ్యమును పరిపాలించిరి. ఎవ్వరును శాశ్వతముగ

నిలుము గూర్చుండి లేవు. ఈతడు మాత్రము శాశ్వతముగ నిందు సుఖము లనుభవింపగలడని యెవ్వరు చెప్పగలరు. అతని నిర్గమనమునకు సమయము వచ్చినప్పుడు, నేను నీ ప్రాణములు దీయక విడువను. జ్ఞప్తి నుంచుకొనుమని భీకరముగ బలికి గాండ్రుమని పెద్దబొబ్బ పెట్టెను.

ఆ శార్దూలము భీకర నినాదమునకు నగర మెల్ల మాఱుమ్రోగెను. దిశలు ఘూర్ణిల్లెను. సాధుజనుల హృదయములు బీటువారెను నెమ్మదిగనున్న కులాంగన లదరిపడి పరిసరముల దిక్కుల జూడసాగిరి. నిదురించియున్న వారలకు నిద్రాభంగమయ్యెను. తపస్విజనులకుం ద్రుటి పాటు తపోభంగము గల్గెను. తరుణవయస్కములగు హరిణాదులు, పెను దవ్వులకు లంఘించి పాఱెను. ఈ రాజ్యక్షోభమున కాగ్రహించి ధర్మ చక్రము, సహస్రసూర్యప్రభావిరాజమానమై కదలి యతిరయంబున నరుగుదెంచి యా చాఱల మెకము శీర్షమును ఖండించెను. సమస్త పౌరులును నాశ్చర్యము జెందిరి. పాపపుణ్య విచారణము సేసి యా చక్రమే సజీవమై దండనఖండనలకుబూనుకొని ధర్మమును నడపుచున్నట్లయ్యెను. ప్రజలు నయమార్గము దప్పక ధర్మాసక్తములగు రాజాజ్ఞలను శిరసా వహించుచు బుణ్యకర్మముల మాత్రము సేయుచుండుటచే దేశమున రుజాబాధయే లేకుండెను, నెలకు మూడు వానలు గురిసెను. ఈతి బాధలు లేవయ్యెను. నూటికి నూరుగా సస్యములు ఫలించెను. “నావిష్ణుః పృథివీ పతిః” యను సుభాషితము సార్థకమగునట్లు ప్రజలు ధర్మార్థ రాజ్యపరిపాలనము సేయుచున్న నలచక్రవర్తిని దేవాంశసంభూతునిగా విశ్వసించి, యాతనివలన నభీష్టసౌఖ్యముల ననుభవించుచుండిరి.

## 4. నలుడు రాజహంసను బట్టుకొనుట.

ఇటులుండ నూతన సంవత్సరారంభమై వసంత సమాగమమయ్యెను. రసాలకిసలయంబుల గోఱికి గానరసంబున రసికులకుం గర్ణానందము సేయు నెలకోయిలలు కూయ నారంభించెను. సాయంసమయములం జిలుకలు శిక్షనొందినవానివోలె శుభవాక్యములంబలుకజొచ్చెను. తుమ్మెదలు ఱెక్కలు విచ్చి పరువులెత్తగ, ఉపవనాంతర్గత నిర్వాయు ప్రదేశములయందును మందమారుతములు జెలరేగం జేసెను. దినములు

గడచిన కొలఁది, సంజచందమామ పెద్దపెరిగి, వెన్నెల స్వచ్ఛతరము సేవాసాగెను. పున్నమనాఁటి తొలిజాము కడపటి గడియలలో నలుఁడు తన యుద్యానవనమున విహరించుచుండెను.

అప్పటి కనుద్యానహితుఁడైన నలుఁడు కర్ణాకర్ణిగా విదర్భరాజ తనయయగు దమయంతి యందచందముల గొప్పతనము విని తనమనంబు నామెయం దుంచుకొని విరహాన్మఖుఁడై యున్న కారణమున నయ్యెడ, నెల, బుడమి నిండార గాయించుచున్న పండువెన్నెల ధాళధళ్యజాలక యొక్క కాయమానమున చంద్రకాంత శిలావేదికపై నుస్సురులుగొట్టుచు మేను నరవాంచి కూరుచుండెను. దమయంతీ లగ్నచిత్తుఁడై విరహమున బెద్దయుంబొద్దు తాపమునుజెంది మేల్కొనుటచే రెండవజాము దక్క నిదిరింపడయ్యె. కుసుమాయుధ విహారసమయము మీఱిన వెనుక నలఁత జెందియున్న కతమ్మున నొడలు తెలియని నిదురనొందెను. అంత నమూరు సారథి దూరుపుదెసం దోచెను. అట్టియెడఁ గొన్ని యంచలు నింగినుండి నేలకు దిగి నలునిమోలద్రవాలి యొయ్యారముగ దమ నడకలతీరు చూడ సాగెను. నలుఁడు వాని గమనాది సౌందర్యమునకు సంతసించి మచ్చటకై వానిలో రాజహంసమును దాను బట్టుకొనెను. తమ జేడు చిక్కువడుటం జేసి మిగిలిన యంచలెల్ల నచ్చోటు డాయక యందే సవిచారముగ జూచుచుండెను. అప్పుడు నలుని జూచి యాతని చేజిక్కిన రాజహంసము "రాజేంద్రా! ఇది యేటి న్యాయము? సకల ధర్మములను దెలిసినవారును ధర్మము నాలుగు పాదముల బ్రవర్తించునట్లు రాజ్యపాలనము సేయువారును నగు మీవంటి ప్రభువులు నిరాధారులమై నీట జీవించు మమ్ము బట్టుకొనుట ధర్మమా? యని మొఱబెట్టెను. నలచక్రవర్తి దాని యార్తనినాదము నరసి, "విహంగతల్లజమా! భయపడకుము. నీ యందచందములకును, నీ సుకుమారమునకు సంతసమంది వేడుకగా నినుఁ బట్టితిని గాని మరేమియుగాదు. నీవు మాత్రము నన్ను సంతోషపరచవలెను" అని పలికిన రాజుగారి వాక్యములను విని, వారి మనోభీష్టముల గుర్తెఱిగినదై "ఓ రాజేంద్రా! మిమ్ములఁ దిలకించగా మదనపీడితులవలె గన్పట్టుచుంటిరి. ఇంతకుఁ గారణము దమయంతి యను కన్యారత్నముపైగల మోహావేశముచే చింతాసాగరమున మునిగినట్లు

దోచుచున్నది. తమవంటి ఘనతకెక్కిన మహారాజులు, ఈలాటి స్వల్ప కార్యంబునకై లభింపవచ్చునా? తామేదియు నాలోచింపవలదు. తాము గోరిన యువతీరత్నమగు ఆ దమయంతి మిమ్ములను వివాహమాడునటుల జేసెదను. నన్ను విడిచిపెట్టుమ"ని పలికిన హంసను జూచి సంతోషించి చిరునగవుతో "ఓ రాజహంసమా! సిది మనుష్యజన్మముకాదు. దేవజన్మముకాదు. పక్షిరూపమునన్న నీవీ యసాధ్యకార్యంబును వేలాగున సాధించగలవు. ఈ నా సంశయం బెడబాపసేయు" మన "ఓ రాజాధిరాజా! భూలోకంబుగల హా నలవలెన న్నెంచకుము, నేను దేవలోకమందు వసించు పక్షిరాజుడను. భూలోకంబునంగల నరులయొక్క మనంబులను బాగుగా గుర్తెరిగి చెప్పగలను. నన్ను కేవల పక్షిజాతి యని దలచవలదు. రూపలావణ్య గుణశీలయగు, దమయంతియను కన్యారత్నమునకు దగు పతియు నీవే. నీ సౌందర్యసుకుమార గాత్రసంధుడవగు నీ అందచందములకు దగు యింతి యా దమయంతియే గాన మీ యిరువురకు దూతనై మిమ్ముల నిద్దరిని యొండుపరచి ఆపై నా నిజస్థలికేగ జెదను నిబద్ధమాడను. అసత్యమునకు లోబడను. నామాటల నమ్మి నన్ను విడచిపెట్టుము. ఈ క్షణమే దమయంతియొద్దకుబోయి తమ సౌందర్యమును దెలిపి ఆమె మనస్సును గరగించి, నిన్ను వివాహమాడునట్లు నా సాహసంబున ఆమెను నీ వశముజేసెదను తా మన్యథా యోచించక నన్ను విడచిపెట్టుడు. నా సమూహముల నంటి పోజాలను. మొదట దమయంతికడకేగి తమ కార్యము నెరవేర్చి వెళ్ళెదను" అని పలుతెరంగుల హితవాక్యములం బల్కిన పక్షినిగాంచి, "ఓ హంసరాజమా! నీ చమత్కార వచనంబులకు సంతసించితిని. నీ వా దమయంతిని గుర్తించి యుందువేమో యెరుగను. అయినను దమయంతి రూపరేఖావిలాసముల దెల్పు" మని యడిగిన నలావనీశునిం జూచి

### 5. హంస నలునకు దమయంతి సౌందర్యముల దెలుపుట.

వినుము. రాజేంద్రా! సోమసూర్యుల సమానమగు కాంతియు, ప్రతాపమును గలిగి యశోవంతుడై విదర్భదేశమును పాలించునట్టి భీమరాజను నాతడు పుత్రసంతానములేక జపతపహోమాది క్రియములతో

వ్రతములును, అనుష్ఠానములును, క్రతువులును బ్రాహ్మణులచేత గావించియు పుత్రులు గలుగకుండుటచే చింతాక్రాంతుడై సింహాసనముపై నధిష్ఠించి, మంత్రి ప్రధాన సేనాధిపతులను పురోహితవిద్వజ్జనంబులును దన్ను బరివేష్టించియున్నతఱి, సభవంకఁజూచి, "సభ్యులారా! మానవు డెట్టివాడైనను, నిర్ధనికుడైనను, మూర్ఖుడైనను, ప్రజ్ఞావంతుడైనను, నెవ్వరిని జూచినను వారు అయ్యా! మీ కెందఱు సంతానమని యడిగెదరు, నీ కెంత ధనమున్నదని గాని, నీ కెంత స్థిరాస్థికలదని యడుగువారుకారు. లేబ్రాయపు బాలురు ముద్దుమాటలాడునపుడు నా కర్ణపుటంబుల మధువు బోసినట్లుండును; ఈ సభారంగమున గూర్చుండి జూచుచుండిన మీ రెల్లరును బుత్రులనుబడసినవారే, కాని మీకు సంతానము గలుగక పూర్వము మీ మనంబులకు నెట్టి పరితాపముండెడిదో యది మీకు ననుభవవేద్యము. కావునఁ దాదృశ పరితాప ఫలితముగ నే నిప్పుడు నా పట్టపుదేవిని వెంట నిడుకొని యరణ్యసీమ కేగి తపమాచరించెదను. నా మనోనైర్మల్యము నెఱింగిన యే దైవమన్నను నన్ను గ్రహింపకపోడు" అని వాక్రుచ్చి మంత్రిపుంగవులం బిల్చి "మంత్రులారా! నేను నా రాజ్యపరిపాలనమును మీ కప్పగించుచున్నాను. ఇంతవఱకుఁ బ్రజలను నా కన్నబిడ్డలయందుకంటె నధికమైన ప్రేమతో నారసియున్నాను. నేను దపశ్చర్య పూర్తి గావించుకొని మఱల వచ్చునంతవఱకును బ్రజాక్షేమమును మీరు విచారింపవలయును" అని పల్కి తన రాజ్యాధికార ముద్రను వారి చేతి కొసంగి భీమభూపాలు డరణ్యసీమ కేగెను.

వారు చేరిన వనమున వాలఖిల్య మహాముని యాశ్రమముగలదు. ఆ సమీపమున నా మహామునికుమారుఁడు దమనమహర్షి తప మొనరించుచుండెను; భీమనృపాలదంపతు లాతనికి శుశ్రూషలు సేయుచు, నాతనివలన సత్కథాశ్రవణాదులొనరించుచు, బ్రొద్దుపుచ్చుచుండెను. కొన్ని దినములదనుక కేవలము భగవధ్ధ్యానము సేయుచు, జటావల్కలధారులై, మునిసేవాతత్పరులై వారి యనుగ్రహమున కెదురు చూచుచుండగా ఒకనాఁ డమ్మహాముని భీమరాజుం గాంచి, "ఓ రాజా! నీవు రాజ్యభారమును వదలి జటావల్కలముల ధరించి తపసులవలె అర

ణ్యాంబు జేరియుండు కారణం బేమని యడిగిన నమ్మునికి దీర్ఘప్రణామంబు లాచరించి "ఓ మహామునీంద్రా! తమ అనుగ్రహంబున సకల భోగ భాగ్యంబులుగలవాడను, సత్కథాశ్రవణుండను, సజ్జనసాంగత్యముగల వాడను. జపతపహోమాది క్రతువులఁ జేయించినవాడను బ్రాహ్మణ ప్రియుడను. ఇన్నివిధముల గలిగియుండియు పుత్రభాగ్యము లేనందుచే, రాజ్యభోగములను విడచి, వాటియందు మనసులేక విరక్తుడనై,యిందు జొచ్చి తమ పాదపద్మంబుల కొరగినాడను. తాము నాయందు కరుణ యుంచి సంతతిగలుగునట్లు నాకు వరమొసంగి యంపితిరేని, సంతోషముగ నేను నారాజ్యమునకు బోఁగలనని పలు తెఱంగుల దైన్యముతో విన్నవించుకొనెను.

దమన మహర్షికి వారియందు గనికరము వొడమి, "రాజదంపతులారా! మీకు నచిరకాలమున దమనాభుడను కుమారుఁను దమయంతి యను కుమార్తెయు గలుగగలరు మీరు పూర్వమున జేసిన పాపములు తొలంగినవి. ఇంక మీరిందునుండ బనిలేదు. తిరిగి మీరు మీ రాజ్యమున కేగి పరిపాలనాభారమును వహించి సుఖంబుగ గాలము గడపుచుండు"డని యానతిచ్చెను. రాజదంపతులు దమనునకు నమస్కరించి యాశీర్వాదములు వడసి నిజదేశమున కేగిరి. భీమనృపాలుడు కుండిన నగరంబు చేరి రాజ్యపీఠము నలంకరించెను. అనతికాలమున రాజపత్ని గర్భవతియయ్యెను. తగుదినములు గడచిన పిమ్మట వారికి బుత్రపుత్రికా సముదయమయ్యెను.

రాజపురోహితుల రావించి ససమయ సంస్కారములు జేయించి దమనుని యానతి ప్రకారము పుత్రునకు దమనాభుడనియు, బుత్రికకు దమయంతి యనియు నామకరణములు సేయించెను. దినక్రమమున బాల బాలికలు తగురీతి నవయవ స్ఫురణము పొంది, వృద్ధిఁ గాంచుచుండిరి. దమయంతి చంద్రకలా సదృశయై అనల్ప రామణీయకముగల్గి చూపఱకన్నులకు బండువుగా గనుపట్ట మొదలిడెను. ఆకుమారి చక్కదనమునుచూచి యెల్ల మానవులును నీమె యొక్క మహాభాగ్యము ననుభవించు రాజపత్ని గావచ్చునని కొనియాడుచుండిరి. ఈ విషయమంతయు నే నెఱుంగుదును. అంతియగాక నే నొకప్పుడా విదర్భదేశమున స్వజాతివిహంగ



హంస నలునిసందేశము దమయంతికి దెల్పుట.

ములతోఁ గూడి విహారము సేయుచున్న సమయమున నాయందగత్తె నాకంటఁబడినది. సామాన్య స్త్రీల ననేకులను జూచిన నాకన్నులకామె యగపడినప్పుడు నేను నివ్వెరపోయితిని. కావున నామె నీకు దగిన పత్ని కాగలదని నా విశ్వాసము. నీవు వేఱుగ నాలోచింపక నాపలుకుల యందు నమ్మక ముంచుము. దమయంతికి నీయందుఁ బ్రేమభావ ముద యించు చందమునఁ జేయగలను. ఆమె నిన్ను బాణిగ్రహణము సేసి కొను విధమున నేర్పాటు సేయించగలను. ఇఁక నాలసింపక నన్ను బంపి వేయుము" అని రాజహంసము నలచక్రవర్తికి విశ్వాస ముదయింప వాక్రుచ్చెను. అది విని నలుడు "హంసతల్లజమా! మనమిప్పు డన్యోన్య మిత్రులమైతిమి. నామనంబుననున్న కోర్కె దెలిసికొని, దానిని పూ రించునంతటి యుపకారము సేయబూనిన నీకు నేనేమి ప్రత్యుపకారము సేయగలను? ఎట్లైనను నామనోభీష్టము నెఱవేఱువఱకు నీవు ప్రయాస పడక తప్పదు. నీ త్రోవ మంగళకరమగుగాక! దమయంతి స్వయముగా నన్ను గోరి వివాహము సేసికొనునట్లు సేయు భారము నీయదియ యని సెప్పుట తప్ప నధికముగ నీకు ఉపదేశింపవలసిన పనిలేదు. నీ వింక శుభమ్ముగ బోయిరమ్ము" అని పల్కి యా రాయంచ మోమున మోము సేర్చి ముద్దిడుకొని, దాని మేను తనకోనవ్రేళ్ళతో నల్లనదువ్వి, యానతి యొసంగి పంపెను.

## 6. హంస దమయంతియొద్దకు బోవుట.

అంత నా రాయంచ తన జాతిపక్షులను గొన్నిటిని దోడుగా గై కొని వినువీధి కెగసి, పోయి పోయి పెక్కు శ్రమలు చెందుచు, మేను జెమ్మటలు వార బ్రయాణము సేయసాగెను. త్రోవలోనగపడినతామర కొలకులయందు నీరు త్రావలేదు. తరుచ్ఛాయలయందు నిలువలేదు. అతి రయమున నొకే యెగురునఁ దన నెచ్చెలిపులుఁగులతోఁగూడి విదర్భదేశ మునకు జేరెను.

ఆట్టి సమయమున, దమయంతి తన యుపవనమునఁ జందనవృక్ష ముల నీడయం దొక శిలావేదికపై గూర్చుండి, యొరులు వినిపించిన నలుని రూపరేఖావిలాసములను మనస్సునం దిడుకొని తదేక చింతా

పరాయత్తయై మదనవేదన ననుభవించుచుండెను. హంసరాజు దమయంతి మ్రోల వ్రాలి యపూర్వ విధానమ్మైన నృత్యము లొనరింపుచుండెను. అంతకుమున్నే మదనతాపమున బరితపించుచున్న దమయంతికా హంస నృత్యము మఱింత వేదనను గలుగజేసెను. మదనుఁడు తనపై వైరముబూని ప్రయోగించిన యస్త్రప్రయోగమోయని దిగులొందెను. దాని ఛాయయు నందమును జూచి, విదర్భ రాజపుత్రి తన చెలికత్తియలను జేర బిల్చి, "చెలులారా! యీ పక్షులను బట్టి తీసికొని రం"డని యానతిచ్చెను. వారాపక్షుల వెంట నంటిరి. సహజముగ నవి యటునిటు బోవజొచ్చెను. వారు విహంగానుగాములై యురుగునప్పుడు పయ్యెదకొంగులు జారినఁ గొందఱు సవరించుకొనసాగిరి. కొందఱ నెత్తిగొప్పులు ముడివీడ ముడుచుకొనసాగిరి, ముక్తాహారము లురమ్ముల జీరలాడెను. మేనెల్ల జెమ్మటలూరెను. సఖురాండ్రింత శ్రమపెట్టుచు దాము తిరుగునప్పుడు హంససంచయము తమ తమ మనోజ్ఞగమనవైఖరులఁ బ్రదర్శించుచు, దమయంతి మనంబున నధికతమానందము గలుగుచుండెను. కేవల మటునిటు పరువులెత్తుటయే గాని యొక్క విహంగమైన నెగిరి పోవకుండుటచే, నవి చేఁజిక్కగలవను ధైర్యము దమయంతి మనంబున నిగురొత్తెను.

క్రమక్రమముగ నయ్యవి యెల్ల దమయంతి మ్రోల కరిగెను. దమయంతి వానిలోఁ బెద్దదైన రాజహంసమును జేతఁ జిక్కించుకొని "విహంగరాజమా! నీ మేనెల్లఁ జెమట లూరినవి. కడుంగడు శ్రమచేసి ప్రయాణముచేసినట్లగపడుచున్నావు. నీ వెక్కడినుండి బయలుదేరితివి? ఇంత శ్రమచేసి యలఁతగొనుటకుఁ గారణమేమి?" యని తన పైట నడుమున జెక్కుకొనిన యొక చేరుమాలుతోఁ దుడిచెను. దమయంతి పలుకుల నాలించిన యా దేవవిహంగము "విదర్భరాజకుమారీ! నీ వతి సుకుమారగాత్రివి. త్రిలోకసుందర నేత్రివి. నీకు దగిన పతి యన దగిన వాని నొక్కని జూచితిని. అతఁడు నిషధదేశాధిపతియగు నలచక్రవర్తి. అతని సౌందర్యాతిశయమును దేవలోకమునందు నప్సరోంగనలు సైతము నభివర్ణించుచుందురు. అంతియగాక యీ యువకుడు సత్యధర్మపరాయణుఁడు. దయాదాక్షిణ్యమయమైన శీలముగలవాఁడు. తన కంట

బడు వేళ నొక చీమనైన బాదమునఁ ద్రొక్కఁడు. పరోపకారమేయాతని రాజ్యపాలనాశయము. అట్టి మహాత్ముఁడు, నీయట్టి కన్యాలలామమునకు వరుడుగా లభించినచో నా యన్యోన్యానురాగమునకు మేరయుండదు. నే ననేక దేశములయందు దిరిగి చూచితిని. లెక్కకు మించిన రాజ కుమారులను రాజకన్యలను నవలోకించియుంటిని. కానిస్త్రీజనమ్ములలో నిన్ను బోలినవారును, పురుషవర్గములలో నలునిబోలినవారును నెందును లేరు. మీ యుభయులు ప్రత్యేకస్థానములయందున్నప్పుడే తత్ప్రాంత మెల్ల సౌందర్యచ్ఛాయామయమై తోచుచుండును. అట్టి యిరువురు, స్త్రీపురుషులు, అసమాన సుందరగాత్రులొక్క తావున నొండొరుల ప్రక్కల గూరుచున్నచో నా ప్రాంతము సౌందర్య మెటు లుండునని చెప్పవచ్చును. అట్టి దంపతులను జూచుటకైనను జగమెంత యానంద మొందునో వర్ణింపనలవికాదు.

జగంబున ముగుదలు తమకు దగిన భర్తలు కావలయునని, తపములు, వ్రతములు, ఉపవాసములు, దానధర్మములు చేయుచుందురు గదా! నీ వే తపంబు సేసినను, ఏ వ్రతము నాచరించినను, నలచక్రవర్తిని గుఱించియే చేయుము. అతడే నీకు దగిన వరుడు. అతని సౌందర్యాతిశయము నెంత సెప్పినను, దనివిదీఱునదికాదు. మన్మథునకు శరీరములేదు. కాని యతఁడు శరీరముగల యంగజుడుగా గనుపట్టును. అందువలన నతనిని జగములు ప్రత్యక్ష మన్మథుడని మోసపోవుచుందురు. ఆతని గుణగణముల నెంచుదమనిన శ్రీమహావిష్ణువు జ్ఞప్తికి వచ్చును. ప్రజలయందు సంపూర్ణ దయారసముగలవాడు. ఆర్తరక్షణ మతనికి మొదటి లక్షణము. పురుషులలో నెల్ల నతడే యుత్తముడని జగదభిప్రాయము. అందువలన నాతనిని గొందఱు పురుషోత్తముడనియే భావించుచుందురు. ఆతని పరాక్రమము దిక్పాలురకు మతిభ్రమ కలుగ జేయుచున్నది. అతడు విష్ణుమూర్తి యంశమున బుట్టినవాడగుటచే కేవల లక్ష్మిస్వరూపలక్షణము లెందున్నవో యట్టి యువతిని మాత్రమే యతడు కన్నెత్తి చూడగలడు గాని, లోకమున సామాన్యస్త్రీల నాతడు తల్లులుగా భావించువాడు. నీయందు లక్ష్మియంశగలదని యాతఁడు కర్ణాకర్ణిగా విని, నీపై ననురాగముబూనియున్నవాడు. నీ సౌకుమార్యలావ

ఖ్యాతిశయములను లోకులవలన విని యానందముజెందుచున్నవాడు. ఆ ధర్మాత్ముని అసత్యము నాతని రాజ్యమున లేవు. అక్రమప్రవర్తనులను నాతడాదరించడు. విప్లవక్రియ స్వయముగా బయలుదేరి శీర్షఖండనము సేయును. దైవభక్తులలో నతడగ్రేసరుడనియు, నాతని నిషధరాజ్యము దైవభక్తి పరిపూర్ణమై యున్నదనియు ప్రఖ్యాతిగలదు. నరేంద్రులెల్లరును నతనికి లోబడి యాతనిచే న్యాయదృష్టిచే విధింపబడిన కప్పములను గజములపైనను, నశ్వములపైనను నిడుకొని వచ్చి యర్పించుచుందురు. అట్టి మండలేశ్వరుడు భర్తగాగలిగిన యువతి జన్మము సార్థకము గదా! నలుని యంగలక్షణములును నీ యవయవలక్షణములను నన్యోన్య సముచితత్వము గలిగియున్నవని సాముద్రికశాస్త్రవేత్తలెందఱో వక్కాణించుచున్నారు. అతని నన్యులయొద్దఁ బొగడి యాతని బహుమానముల నాశించెడివానినిగా నన్ను భావింపకుము. అదియునుంగాక నీ మనం బాతనియం దాసక్తమైనదని తెలిసికొని పరిపరివిధముల నాతనిని నీయెదుట నభివర్ణించి నీవలనఁ బారితోషికములు బడయు నభిప్రాయముతో నేను వచ్చియుండలేదు. మీ దాక్షిణ్యములతోను, మీ పారితోషికములతోను నాకు నిమిత్తములేదు. మీభావము లొండొరులయందు లగించియుండుటచే నిట్టి వధూవరుల నొక్కచో జేర్చుట మహాపుణ్యకార్యమని పెద్దలవలన విని నే నీకార్యమునకు గడంగియున్నాను. మన్మథభోగాతిశయములను గోరు రతీదేవివలె నీవు వెలుగొందుచున్నావు. అతడు రతీభోగభాగ్యముగోరు మన్మథునివలె విరాజిల్లుచున్నాడు. అట్లు మీరుభయులు భూలోక రతీమన్మథులవలె విరాజిల్లగలరని నిండుమనంబున వాకొనుచున్నాను. అట్టి నలచక్రవర్తిని గూడి నీవు సుఖంబున నుండు దినము లెన్నాళ్ళకు వచ్చునో గదా!” అని సంభాషించెను. రాయంచ మృదుమధుర భాషణంబులకు దమయంతి మహానందసాగరనిమగ్నయై, తల యూగించి, చిఱునగవుతో నిట్లు ప్రతిభాషించెను.

“ఓ విహంగతల్లజమా! నీవు చేసిన సంభాషణముసత్యదూరము గాదు. నలచక్రవర్తి గుణ శీలములు, పరాక్రమ గాంభీర్యాదులు నా చిన్నటనాటినుండియును విని విని నామనంబాతనియందు లగ్నమైయున్న

దనుమాట సత్యము. అతడే నాకు పతి గావలయునని నేను ప్రతిదినమును శారదాదేవిని బూజించుచున్నాను. నీవు దేవతావిహంగమ వగుటచే నింతదూరము గ్రహించి వాకు(?)చ్చితివి. నామనస్సు నలుని విడచి మరి యొకనియందు నిలువదు. నే నాతనియందు మోహావేశముగలిగి మదన వేదనలఁ బరితపించుచున్నదానను నలునియందు నాకుగల వ్యామోహ మును వెలిబుచ్చుటకు నాకు సిగ్గగుచున్నది. వాస్తవమంతయు నీవెఱిగి వాఁడవింటివి. ఆ పుణ్యశీలి నన్ను బాణిగ్రహణము చేసికొనునట్లు లాతనికి జెప్పువారెవరు ? ఆతనికి నాయం దనురాగము వొడమునట్లు చేయువా రెవరు ? నా మొఱ ఆలకించి నాయభీష్టము నెఱవేర్పగలిగినంటిత బంధుమిత్రులు నాకు లేరు. నా సఖీజనుల కంతటిసామర్థ్యము లేదు. మా యుభయుల రూపంబులను నొండొంటికి దగినవని నీవే వచియించితివి. అతని గుణగణంబులను నాకు దెలిపి నాకు మనోరంజనముచేసిన చంద మున నీవే నాగుణవిశేషములను నలున కెఱింగించి యతనిమనంబునాపై నిగుడి నెలవుకొనునంతటి యుపకారము నీవే చేయవలయును గాని య య్యది మఱియొకరివలన గాదు. ఆ నలుని సుందరరూపమును జగదభి వర్ణిత పవిత్రాకారముగ నామనఃఫలకమున వ్రాసికొనియున్నాను. దానిని దుడిచివైచుటకు బ్రహ్మదేవునికైనను వశముకాదని గుర్తించుము. ఆ మహారాజు నిందులకు దోడ్కొనివచ్చి నామన్మథావేదన నణం చుము. అతడు నాపాణిం బట్టుటకు సమ్మతించునట్లు చేయుము. ఇట్లొన రించు నీమహోపకారము నాజీవితాంతముపఱకు మఱువకుందును."

ఇట్లాడిన దమయంతీకుమారి పలుకులకు పక్షిరాజు లోలోన సంతసించుచుండెను. నేను గోరి యరుదెంచిన తలంపు ఈడేరెనని భా వించుచుండెను. తోడ్తోన నారాయంచ, "దమయంతీ! వంతనొందకుము. సహృదయాదరభావమున నన్ను నీ వా నలుని బాణిగ్రహణము చేసి కొనునట్లు సేయుమని యర్థించితివి గావున నే నాకార్యమును సాధించె దను. ధైర్యము వీడకుము. నలుడు నీచేయి పట్టుట సత్యమని నమ్మి యుండుము. నాసత్యశీలమున విశ్వాసముగలిగియుండుము. నేను దేవ లోకమునుండి వచ్చిన విహంగమనుగాని, కేవల ముదర భరినిగాను. ఇఁక నాకు శీఘ్రముముగ సెలవొసంగుము చనెద" ననిన, అంత నత్యా

నందభరితయై దమయంతి పక్షీంద్రునిఁగాంచి "ఓ రాజహంసమా! నీవు పూనుకొనిన యీకార్యమునకు ప్రత్యుపకారము జేయుటకు అసమర్థురాలను. నానమస్కారములే నీకు పరిదానముగా దలచుకొనుమనియు, కార్యసాధనము గావించుకొని రమ్మని సెలవొసంగెను, తత్క్షణమే తన పక్షుల సమూహముతో గలసి, గగనమార్గమున కెగసి నిషధదేశంబున మన్మథపీడితుండై, నందనవనంబున పొన్నచెట్టునీడను చంద్రకాంతమణులచే కట్టబడిన అరుగుపై బరుండి దమయంతీ తరళాక్షిపై మరులుగలిగి నిద్రలేక పొరలుచున్న నలమహారాజుచెంత జేరెను. అప్పు డారాజు అమిత పులకాంకితుడై హంసరాజమునుజూచి, "ఓ రాజహంసమా! నీరాకకై నిరీక్షించుచున్న నాకన్నుల నీదర్శనంబిచ్చి హితంబు గావించితివి. అలాగునె నీవు గొనివచ్చిన శుభవార్తలందిచ్చి నావీనులకును బండువు సేయుము" అని నొడివినంతన యాపులుగుఱేడు "రాజన్యచూడామణీ! నీవుపుణ్యపురుషుడవు. మురారిభక్తుడవు. మురార్యంశసంజనితుడవు. సిద్ధసంకల్పుడవు. నీకోర్కె నెఱవేఱినది నీయభీష్టము సఫలమగునట్లు లాజగద్రక్షకు డనుగ్రహించినాఁడు. నే నా రాచకన్నియను జేరువఱకు ఆమె యంతకుమున్నే నీ రూపరేఖావిలాసములను, శీలలక్షణమును ధర్మపరాయణత్వమును వేనోళ్ళ విని నీయందు లగ్నానురాగయై, నిన్నే ధ్యానించుచు, సఖీజనములతో నాటలైన నాడక, ముచ్చటలైన చేయక మైమఱచి తన కేళీవనమున నొకతరువునీడక్రిందఁ జెక్కిట జేయి నిడుకొని కూర్చుండియుండెను. నే నామె మ్రోల వ్రాలి నా గమనవిలాసములు బయల్పడ విహరించు నెడ నన్ను గేలంగొని, యల్లన దువ్వి, చిరస్మరణీయమగు నాదరమును నాయందు జూపెను. చెమ్మటలూరుచున్న నామేను తనచేతి పట్టురుమాలుతో దుడిచి మూర్కొనెను. మా యుభయులకు మిత్రప్రసంగ మారంభమాయెను. దమయంతి నిన్ను దక్క నొరులను గోరదు. ఆమె యౌవనసౌందర్యముసామాన్యముగాదు. వియత్పథమునఁ దిరుగాడు చంద్రుఁడు కొంతకాలము క్షీణభావము నొందుటంజేసి, భూలోకమున, క్షీణతారహితమగు నొక్క చంద్రబింబమును జలజాసనుడు సృజించియుండవచ్చునని నాకుదోఁచెడిది, ఇయ్యవి ముఖప్రీతికరవచనములుకావు. నీ విదివఱకు నామె సౌందర్యము నిత

వుల నోటివెంట వింటివి గాని కన్నులారఁ జూచియుండలేదు. కాని నేను కన్నులారఁ జూచివచ్చితిని వారు వారు చెప్పిన మాటలతో నేల? ప్రత్యక్షసాక్షినగు నాపలుకుల నించుక యాలకించుము. దమయంతిలక్షణము లెట్టివో వినిపించెదను.

7. హంస దమయంతి యభీష్టమును నలునకు దెలువుట.

ఆమె మైచాయ పదియారువన్నెల బంగారమునకు వన్నెబెట్టినట్లున్నది. కెందామరలపై ముత్యము ప్రకాశించునట్లు కుంకుమరేఖలతో గూడిన నునువు పాదములును, కరతలముల వ్రేళ్ళున్ను, కాహాళముల వంటి పిక్కలును, బూరుగబుడుసులను ధిక్కరించునట్టి మోకాళ్ళున్ను, లేత అరటికంబములవంటి తొడలున్ను, ఉమామహేశ్వరునిచేతి డమరకమో యని దలచునట్టి నడుమున్ను, నీటి సుడియని దలచునట్టినాభియు, రావిపత్రమువంటి కడుపున్ను, బంగారుకుండలములవంటి కుచములున్ను, తామరతూడులవంటి చేతులున్ను, శంఖమను గళమున్ను, తెల్లతామర దళములవంటి నేత్రములున్ను, ఇంద్రధనుస్సువంటి కనుబొమలున్ను, శ్రీకారములవంటి చెవులున్ను, తిలపుష్పమువంటి నాసికయును, దాడిమ బీజములవంటి దంతములును, దొండపండువంటి పెదవులును, అర్ధచంద్రునివంటి నుదురును, పాదాంతకేశియై ప్రకాశించునట్టి యాసుందరాంగిని వర్ణించ నాదిశేషునికైన నలవిగాదు. పక్షిమాత్రుడనగు నేను అబ్బిడను వర్ణింపజాలుదునా?

అట్టి త్రిలోకసుందరి, నిష్కళంకచరిత్రి చిరకాలమునుండి నీగుణ గణములను విని, నిన్ను వరించి, నీసమాగమ మెప్పుడు కాగలదా? యని పరమేశ్వరుని నెల్లవేళల ధ్యానించుచున్నది. నీవు నిరాకరించితి వేని యామె యసువుల దొఱంగి, యూర్ధ్వలోకముల కేగనున్నది. నీవు సత్వరముగ నేగి యామెను బాణిగ్రహణము జేసికొంటివేని జీవించి యుండగలదు. కావున సత్వరముగ బంధుమిత్రపరివార సమేతముగ విదర్భం జేరి యామె నాలోకించి, తోలుదొల్త నామె యసురులు గోలుపోవకుండునట్లు చేయుము. నా మాట నిలిపి, నా దౌత్యము సార్థ

కము చేయుము. దమయంతి మనమ్మునకు సంతృప్తి చేకూర్పుము. ఇంక నేను బోయెదను" అని నొడివి తన తోడియంచలతోఁ గలసి జలజసంభవుని లోకమునకుఁ బయనము చేసెను.

## 8. నలదమయంతుల మదనావేదన.

పిమ్మట నిక్ష్వాకువంశమండనుఁడగు నలమహారాజు చెఱకువిల్కాని సుమశరంబులకు దాళజాలక, యలఁతఁజెంది నిముస మొక యేడుగా గాలముబుచ్చుచుండెను. దమయంతీ కుమారిక మనోజ్ఞవిగ్రహమును నంతశ్చక్షువున జూచుచు నీ యెలనాగ నాకెన్న డలవడునో గదా. ఈ మొరటు పూవిల్కాని శరానలము నార్ప నాయువిద యధరామృతరసం బెన్న డలవడునో గదా యని పొరింబొరిఁ జింతించుచు రేయింబవల్లు నిద్రాహారములు లేక, వేదనాసాగరమునఁబడి గిలగిల దన్నుకొనుచుండెను. అచ్చట విదర్భదేశమున దమయంతి, భీమరాజపుత్రి, హంసరాజ మాడిన పలుకుల నాలకించినది మొదలుకొని, యన్నపానీయములఁద్యజించెను. చెలికత్తెయల జేరబిల్వదాయెను. చిలుకలకు ఉక్కెరలబెట్ట నొల్లదయ్యెను. పికీనినాదమాధుర్యమున కేవగము నూపనయ్యెను. గండుతుమ్మెదల ఝుంకారములకు గడగడ వడంకసాగెను. పిల్లతెమ్మెరలు వీచునప్పుడు సైపజాలక శూన్యప్రదేశములను గాగిలించుకొననయ్యెను. రాజా రాజా యని నిషధాధీశ్వరుని నామమే మంత్రముగా భావించి, యొడ లెఱుగక నుండెను. ఒడ లెఱుంగని యప్పుడును, నొక్కొక్క చేష్టలు జూప జొచ్చెను. చిత్తవిభ్రమముచే వెర్రిదానివలె జూచుచు, నలుడు గానవచ్చినట్లు దలంచి యేమేమో ప్రసంగించుచు మదనావేశమున మైమఱచినప్పు డొక్కొక్కప్పుడు తాపంబున నుస్సురులుగొట్టుచు బరిపరివిధముల నూహాలు సేయ మొదలిడెను. కొంతవడి, రాయంచ నాతో నాడినట్లు గావించునో లేక నన్ను మఱచెనో యనుకొనును. కొండొకసేపు, నలుడు విహంగరాజము సేసిన సంభాషణము నాతడు సరకు సేసెనో, లేక, యదియెల్ల కల్ల యనుకొనెనో యని భావించును. నలునకు నాయందు నెనరు గలిగి తద్రాజ్యము దూరస్థమగుటచే నాలసించుచుండెనేమో! ఒకవేళ దూతల నంపి, దాను రాఁదలంచడేమో?

యని మఱికొంత సేపు చింతింపనయ్యెను. మఱియు నొక కొంతతడ వొక పచ్చకాల వేదికపైఁ గూరుచుండి, చెక్కిటఁ జేయి నుంచుకొని, నలుడు రానిచో నే నేమి చేయవలయుననితీవ్రముగవిచారింపనయ్యెను. కొందఱు చేరువనున్న చెలికత్తెలు, దమయంతి చిత్తవిభ్రమమునకు నిర్వేరపోవుచు, "అమ్మా! నీకీ యాలోచన యేమి? నిన్నెవ్వరైన దూషించిరా? నీ కన్నము రుచించుటలేదా? ఇప్పుడు నీ మనశ్చింత యేమి?" యని ప్రశ్నించిరి. ఆమె సిగ్గున దలవాంచినప్పు డొక సఖి "ఓహో! ఇదియా? నా కర్థమైనది. రాజహంసము వెడలిపోయినది మొదలుకొని యీమె కీ వైపరీత్యము గలిగినది. ఆ పక్షీంద్రుడు ఈమెకు నలునియం దాశ కలుగజేసెను. అప్పటినుండియు నీమె మనం బాతని యందు దగులుకొని వెనుకకు రాకయున్నది. బుద్ధి స్వాధీనము తప్పినది. నలమహారాజు జీవించియుండియు దయ్యమై మన దమయంతిని బట్టినట్లు తోచుచున్నది. ఈ మతిమాంద్య మీమె కెన్నడైన నుండెనా? నలుడను గాలియే యీమె కింత మనోవైకల్యము గలుగజేసినది. నెచ్చెలులారా! మన మీవృత్తాంతము భీమనృపాలున కెఱింగింపవలయును. కానిచో మనము తప్పుచేసినవారమై రాజశాసనమునకు లోబడవలసిన వార మగుదుము" అని సంభాషించిరి. మిగిలినవా రామాటలు విని వెంటనే భీమనృపాలుని కడ కరిగి, ఇట్లు విన్నవించిరి. "రాజేంద్రా! తమ ముద్దులపట్టియగు దమయంతినింతవఱకు మే మే మనశ్చింతలపాలును గాకుండునటులు కాపాడగలిగితిమి. ఆమె కిప్పుడు ఎలప్రాయము వచ్చినది. నిన్నటి దినమున మన యాటతోటలోనికిఁ గొన్ని యంచలు వచ్చినవి. వానిలో నుత్తముడగు నొక హంసరాజు, మన దమయంతిమోలనుండి నిషధదేశాధీశుడగు నలమహారాజు రూపయౌవనసంపదనుగూర్చియు, బరాక్రమగాంభీర్యదయాదాక్షిణ్యాదులనుగూర్చియుప్రసంగించి, యీమె కాతనియందే మనమ్ము నిల్చునట్లు చేసి పోయెను. అప్పటినుండియు, మన దమయంతికి మతిమాంద్యము సంఘటించినది. ఆ బుద్ధిమాంద్యము నడంచుటకు మాకు శక్తి చాలకున్నది. ఎంత సెప్పినను నామె చిత్తమా నలునినుండి మరల్ప లేకున్నది. విషయము నేలిక చిత్తమునకు దెచ్చితిమి. కర్తవ్య మాలోచింపుడు. మాయందు దోషారోపణముచేయ వలదు."

ఇట్లు చెప్పియు, వారలామహారాజు మ్రోల సాగిలబడి నమస్కరించిరి. భీమనరపాలుఁడా చెలికత్తియలఁజూచి, "ఓ యువతీమతల్లులారా! దమయంతి పరిస్థితియంతయు మీరే బాగుగా నెఱుంగుదురు. ఆమె స్వస్థచిత్తయగుటకు నేమి యుపాయము అవసరమో అది మీరే చెప్పుడు. మీరు చెప్పిన ప్రకారముచేసి యామె మతిమాంద్యము తొలగించెదము" అని ప్రస్తావింప, నాదాదులెల్లరు నేకముఖముగా నిట్లనిరి. "రాజేంద్రా! ఇఁక దినములు గడచిన కొలఁది యామె సంతాపమధికమగును గాని తగ్గునట్టు లగపడలేదు. కావున నొక్క శుభదినమును విచారించి యానాఁడు దమయంతికి స్వయంవరమని యెల్ల దేశములయందును బ్రకటింపఁజేయుడు ఆయా దేశముల యధిపతులతోఁబాటు నిషధ దేశాధీశ్వరుడగు నలమహారాజును నిచ్చటికి రాగలఁడు. అప్పు డెవ్వరికీ కన్యకామణి ప్రీతియున్నదో వాని నీమె కోరుకొనఁగలదు. ఇదియే యిందులకు దగిన యుపాయము. ఆమె వరించినవానికిచ్చి పాణిగ్రహణము చేయించితిరేని యామె యభీష్టము నెరవేరినదగును." సఖీమణుల పలుకుల నాలించి, పుడమిఱేఁడు, కొలువు నెలవునకుం జేరి, మంత్రి సామంతపురోహితుల నెల్లర రావించి, "అంగ, వంగ, కళింగ, కాశ్మీరాది సమస్త దేశముల యధిపతులకును స్వయంవర పత్రికలు వ్రాసి పంపవలసినదని యానతిచ్చెను. అట్లు పత్రికలు వ్రాసి యంపిన యనంతరమున నియమిత దివసమునకు సకల దేశాధీశులును రథ, గజ, తురంగాది వాహనములతోఁగూడ విదర్భ కరుగుదెంచిరి.

వారితోఁబాటు నిషధాధిపతియును నేతెంచెను. రాజులెల్లరు తమకు నియమించబడిన విడిదిస్థానములయందు డిగ్గిరి. నలమహారాజా యువతి యెవ్వరిని గోరుకొనునో, ఎవనియింట నా శ్రీమహాలక్ష్మి సమానురాలు, ఁ సముజేయ నరుగునో, యెవ్వని భాగ్యము పండినదో యని పలుతెరంగులఁ జింతించుచుండెను.

ఇట్లు బృహదశ్వమహాముని చెప్పిన ధర్మరాజు, స్వాంతమున నాతృత జెంది "స్వామీ! అంత నేమాయె? దమయంతి వెంటనే నలుని గోరుకొనెనా?" యని యడిగెను.

## 9. నలమహారాజు దూతగా నరుగుట.

అంత బృహదశ్వమహాముని ధర్మనందనునిజూచి, "యుధిష్ఠిరా! శ్రద్ధగా నవలోకింపుము. నలచక్రవర్తి కిప్పటినుండియు నిడుములు ప్రారంభమయినవని హెచ్చరించి యావల నిట్లు చెప్పదొడంగెను.

స్వయంవరము నిమిత్తము నావిదర్భదేశమునకు నానారాజాధిరాజులు నేతెంచియుండ నారదమహర్షి యానగరవైభవము నారసి, రాజుల నెల్లర నవలోకించి. "యింద్రునికన్న నలుఁ డెక్కువ రూపగుణాతిశయసంపన్నుడని దేవతలకు సయితము దెలియజేయవలయునను తలంపున. నింద్రలోకమున కరిగి యింద్రుని సమీపించి, "సురనాయకా నీవు దేవలోకమునకు నాయకుడవై యింద్రాణిం జేకూర్చుకొనియున్న వాఁడవు. అట్టి యువతు లెందరైనను, భీమరాజపుత్రియగు దమయంతికి సరిపోలగలరు. దమయంతి కిప్పుడు స్వయంవరమని విదర్భాధిపతియగు భీమరాజు ప్రకటించియున్నాడు. ఆ స్వయంవరమునకు సమస్త దేశాధీశులును విచ్చేసియున్నారు. ఆ మహోత్సవము గన్నులారఁ జూచి యానందింపవలసినట్లున్నది. లక్ష్మీసమానురాలగు దమయంతిని పాణిగ్రహణము చేయు భూపతి, పురుషోత్తమసదృశుడగును. అతని యింటనే లక్ష్మీ నివాసము చేయును. అతడే పుణ్యాత్ముడగును. అతడేసౌశీల్యము గలవాడగును. అతడే భోగి, అతడే సుఖశాలి. నీవు భూలోకమునంగల విశేషము లేవియని యడుగుటచే నీ సమాచారము నీ చెవిం బడవైచినాడను. ఇఁక నేఁ బోయెద"నని తెలియఁజెప్పెను. మఱియు నంతటితో సెలవు తీసికొని వినువీధి కేగి యథేచ్ఛం జనియెను

దేవేంద్రుఁ డా నారదమహాముని పలుకుల నాలకించి, యష్టదిక్పాలకుల రావించి, భూలోకమున జరుగుచున్న మహావైభవసమేతమగు స్వయంవరమును గుఱించి తెలియబఱచి. వారి నెల్లఱఁ దోడ్కొని, రత్నఖచితమగు సువర్ణవిమానము నధివసించి, విదర్భదేశమున కేగెను. అందును నలమహారాజు, విడిది చేసిన మందిరమునకు బోయి, దిక్పాలకు లెల్లరు సుఖాసీనులైరి. అయ్యెడ నలుం డింద్రుఁ జూచి, నమస్కరించి భక్తివినయసంపన్నుడై "అమరేంద్రా! తా మిత్తావునకు దయచేయుట

నా పూర్వపుణ్యఫలము ఆహా! నాభాగ్య మినుమడించినది. తమవంటి మహాపుణ్యపురుషుల సందర్శనమువలన నాకెట్టి శ్రేయస్సు కలుగునో తెమ రిందుల కెందుల కేతెంచితిరో సెలవొసంగుడు. మీా రుద్దేశించిన కార్యము నావలననైనచో శిరసావహించి యాచరించెదను" అనెను. అంత నమరేంద్రుడు "రాజా! నీవు పుణ్యశాలివి. భూలోకమునకిందుడ డవు. సద్గుణసంపన్నుడవు. సురలోకమున నింద్రుడగువాని కార్యములు నెరవేర్చుటకు దగినవాడవు. నేను బూనుకొనిన కార్యము నీవు నెర వేర్పవలయును చెప్పుదునా?" అనెను. నావుడు క్రమ్మఱ నలమహారాజు "దేవేంద్రా! నాకు సాధ్యమగు పనియైనచో దాని నెట్టిదైన నెరవేర్చె దను. తత్ కార్యస్వభావమును నాకు దెలియజేయుడు" అనియు జెప్పెను.

"నలమహారాజా! నీవు నాపక్షమున దమయంతియొద్దకుబోయి దేవేంద్రుడు దిక్పాలకులతో నిచ్చటకరుగుదెంచియున్నవాడనియు, దాను దేవవిభుని, బెండ్లియాడినచో నింద్రపదవిని బొంది, సకల భోగభాగ్యములతో సుఖింపవచ్చుననియు, దానివలన దనకు శాశ్వత శ్రేయస్సు కలుగగలదనియు వాక్రుచ్చుము. ఇదియే నీవలన నాకు గాదగిన మహోప కారము."

"అమరేశ్వరా! ఇది యేమి యన్యాయము? ఒక దేశాధిపతి కిట్టి దౌత్యవ్యాపార మర్హమా? ఒకవేళ మీాయందలి యభిమానమువలన నే నీ పనికి బూనుకొనినను దక్కిన భూపాలురు నన్నెట్టి దృష్టితో జూతురు? నే నిట్టి దౌత్యమునకు దలయొగ్గితిననిన నాదేశమునందలి ప్రజలు నన్నెట్లు రాజుగా గౌరవింపగలరు. జగద్దృష్టిలో నేనొక హీన వృత్తి నవలంబించినవాడనుగానా? ఆ తియగాక దమయంతికడకుంబోయి నేను తమ కోరికను వెల్లడించినచో నామె న న్నెవ్వనిగా భావించును? కావున న న్నీ కార్యమునకుఁ బాల్పడ నొత్తిడి జేయకుము."

"నిషధేశ్వరా! సమస్త దేవతల కధీశ్వరుడనగు నాకొక వాగ్దానముచేసి తప్పుచున్నావు. నాకు సాధ్యమైన పని దేనినైనఁ జేయగలను జెప్పుమని పలికినందున నా యభీష్టము వెల్లడించితిని. నీవుసత్యముదప్పుట పాడిగాదు. ఇక్ష్వాకువంశజనితులగు రాజులెల్లరును సత్యదీక్ష నవలం

బించి ప్రఖ్యాతిగాంచిరి. అట్టి నీపూర్వీకుల ప్రఖ్యాతికి భంగము తెచ్చెదవా ? భూలోకమున దిరుగు నొక్క సామాన్యుడు దేవలోకసంచారులకు ప్రీతి గావించినచో త్రిజగంబులయందును యశోగౌరవములుగల్గునను విషయము నీకెఱుంగవా ? దేవతాదుల కిష్టముచేసినవానియందు శంకరాదులు సైతము దయచూపుదురు. దీర్ఘాలోచనచేసి, నాకార్యము నెరవేర్చి, నీ సత్యభాషిత్వము కాపాడుకొనుము "

"నిర్జరేశ్వరా ! తమరు వచించిన వెల్ల నిక్కమే ? కాని తమ వలెనే నేనును దమయంతిని వరించి వచ్చియున్నవాడను. ఈరూపముననే నాయువతి నెట్లు చేరుదును ? చేరియు నేమని భాషింతును ? కావున నన్ను క్షమించుట యుత్తమము గాదా !"

"నలమహారాజా ' దమయంతి మాత్రము నీరూపమునుగుర్తించునట్లును నొరుల కెవ్వరికి నీ వగపడకుండునట్లును, నీ కొక మంత్రము నుపదేశించెదను. ఈ మంత్ర ముచ్చారణచేసి నీ వరుగుము. నీ కే గౌరవ హానియు గలుగనేరదు." ఇట్లు ప్రసంగించి దేవేంద్రుడు నలున కొక మంత్రము నుపదేశించెను. మఱియు తన విధిం దూరుచు బరితాపము నొందుచున్న యా దేవాధినాయకుడు "భూవరా ! నీవిపు డన్యుల కగపడవు. తిన్నగ దనుయంతి యంతఃపురమునకుఁ బొమ్ము. దనుయంతి తన సఖీజనములలో ముచ్చటలాడుచుండును. అట్టియెడ నీ నేర్పుకొలది దనుయంతికి నాయం దభీష్టముగల్గ మాటాడి నాకార్యము సాధించుకొని ర" మ్మనెను. నలుడు, "స్వామీ ! మీ యానతిప్రకారము చేసెదను. కాని యామె చిత్త మెట్లున్నదో నే నెఱుగను. మీ గౌరవమును మీమహాభోగభాగ్యాధికారమును నామెకు దెలిపెదను. ఆమె మీయందు మనసు పెట్టక మిమ్ములనంగీకరింపనిచో నన్ను నిందించుట పాడిగాదు. నాపై నిందారోపణము నేయ జనదు ఇదియే నాప్రార్థనము" అని సురేంద్రాదుల సెలవు గైకొని పయనమయ్యెను.

కొంతదవ్వునకుఁ బోయి నలచక్రవర్తి తనలో నిట్లు చింతించెను. "ఆహా ! యేమి నావిధి ? నా కిప్పు డిరుదెసల జిక్కువచ్చినది. మొదలు దౌత్యమును జేయించుకొను మహారాజునై యొరులకు నేనుస్వయముగ దౌత్యము నడుపవలసివచ్చినది. అగుగాక, నేను స్వయముగా దమయం

తిని వరించి, మోహమున బరితాపము చెంది చెంది, తుదకు సురనాయ కుని వరింపుమని నేనే స్వయముగా నాదమయంతికి జెప్పవలసివచ్చినది గదా!"

పదంపడి నలుడు మనమ్ము గట్టిచేసికొని, యిందోపదిష్టంబగు మంత్రము నుచ్చారణ సేయుచు, దమయంతియంత పురంబునకుబోయెను. దమయంతి యా సమయంబున సఖీజనులతో ముచ్చటలాడుచుండెను. దమయంతి క్రొత్తగా బోయిన మహారాజుం గాంచి యెవ్వరో దివ్య పురుషులు వచ్చిరని సఖీజనము మధ్యకు బోయి యొక చెలికత్తెను దనకు జాటు సేసికొని, తలవంచుకొనియు నోరగా నాతని వంకకాగుగా జూచి, యాలోచించి, హంస చెప్పిన లక్షణములను జ్ఞప్తికి దెచ్చికొని, యా లక్షణము లాతనియందుండుటం జూచి యతడే నలచక్రవర్తియని నిశ్చ యించుకొనెను. అంతట జెలికత్తెలకు గనుసన్నసేసి యుచితాసనమును వేయించి యందు గూర్చుండజేసెను. నలుం డాయాసన మలంకరించిన పిదప దమయంతి "ఆర్యా! మీ దేదేశము; ఎందుండి యిందుల కేతెంచి తిరో? ఆనతీయగలరా?" యనెను. "దమయంతి! నేను నిషధాధీశ్వరు డను. నాపేరు నలుడు. నేను నీ కొక వార్త చెప్పవచ్చితిని మాదృశు లగు రాజు లెందరైనను భూమి నేలువారలే గాని యధిక పదవుల కధి కారముగలవారముకాము. నేడు మీ నగరమునకు దేవేంద్రుడును, నితర దిక్పాలకులును స్వయంవరమున గోరబడుటకై వచ్చియున్నవారు. వారికి దూతనై నేను నీయొద్దకువచ్చియున్నవాడను. వారిలో నింద్రుడు గలడు. అతడుమహాదైశ్వర్యసంపన్నుడు.ఇతరులునుతత్తదధికారములతో తేజరిల్లుచున్నారు. వారిలో నెవ్వరినైన నొకరిని గోరి, వివాహము సేసికొమ్ము. అందువలన నీవు మహాయశంబును, నాయురారోగ్యము లును గలుగగలవు, ఇంద్రుడే నీభాగ్యవశమున నీయొద్దకు వచ్చియున్న వాడు. మానవజన్మమున కింతకంటె గావలసిన దేమున్నది? అనేకు లింద్రపదవిని బొందుటకు జిరకాలము తపస్సుచేయుదురు. కొందఱు తపస్సు నాచరించియు, నించుక లోపముచే నింద్రలోకము సేర నేరక, న్యూనావస్థలలో నుందురు అట్టి దుస్సాధ్య ఫలితార్థ మనాయాసముగ నీకు లభింపనున్నప్పుడు నీవు వెనుద్రోయనేమిటికి? నీ వాతని వరించి

వివాహము సేసికొనుము. ఇది యింద్రుని యభిప్రాయము. ఆయన పంపిన సందేశమును నేను నీ కందజేసితిని. యోజించుకొనుము” అని చెప్పిన నలుని పలుకుల నాలకించి, మనంబున దిగులొంది చిఱునగవు మొగంబున దోప నల్లన శిరఃకంపము సేసి యిట్లు భాషించెను.

“నలసార్వభౌమా! ఎంతమాట? తమ గుణవిశేషములను, ధర్మతత్పరత్వమును, న్యాయశీలమును, ప్రజానురాగమును, సత్యస్వభావమును జగమ్మువలన విని చిరకాలమునుండి తమపై గోరిక పెట్టుకొనియుంటిని. అది యట్లుండ నాయభీష్టమున కనుకూలముగ దాము రాజహంసను నాయొద్దకి బంపి, తమ మనోభీష్టము నాయందున్నట్లును దెలియజేసితిరి. పరస్పర సమాలోకనము కాదగిన యవకాశ మొక్కటియే శేషించియుండెను. అందువలన దా మిక్కడకు వచ్చు నుపాయమునకై నా యభీష్టము నాతండ్రియగు భీమనృపాలున కెఱింగించి స్వయంవరమును బ్రకటింపఁ జేసితిని. నా భాగ్యవశమ్మున మీ రీ విదర్భదేశమున కరుగుదెంచుట సంభవించినది. కాని తమ యభీష్టములో నింత శీఘ్రకాలమున మార్పు కల్గుట కెంతయు నాశ్చర్యపడుచున్నాను. స్త్రీలకు గల దృఢచిత్తము పురుషులకు లేదనుమాట మీయందు ధ్రువపడుచున్నది. పురుషజాతికి మీ రపకీర్తి తెచ్చుచున్నారు.

అది యటుండ మీ రూపరేఖాదులను, గుణగణమ్ములను విని నది మొదలుకొని నలసార్వభౌముని బతిగా గూర్పుడని ఎల్ల దేవతలను బ్రార్థించుచుంటిని. అట్టియెడ దేవతలందఱును నాకు దండ్రులుగారా? దేవేంద్రాదులు దేవగణములోనివారు. ఎట్టి కాత్రాయనగు నన్ను బాణిగ్రహణము సేసికొనుటకు సమ్మతింపవచ్చునా? ఎట్టియు సాముద్రికలక్షణముల ప్రకారము, దేవతలు దేవతలను, అసురులనురులను, నరులు నరులను జేపట్టవలయునని చెప్పబడినది గాని, దేవగణములోనివారు మానవాంగన కేల్బట్టవచ్చునని నిర్దేశింపబడియుండలేదు. నాకు మీయందుగల మోహమును గుర్తించి, మిమ్ము నిందు రప్పించుటకీ స్వయంవరము చాటింపఁజేసిరిగాని, వీరందఱిలో నిక్కడ నేమియు బనిలేదు. నేను మనఃపూర్వకముగా మిమ్ములను గోరుకొనియుంటిని. మీ మనో

హార విగ్రహచ్ఛాయను నామనఃఫలకంబున లిఖించుకొని తదేకధ్యానమున గాలమునకై వేచియుంటిని. మీయందుఁ దప్ప మఱియొకడు పరమేశ్వరుడైనను వానిని నేను స్మరింపజాలను. కోరజాలను. మీరు నన్నొల్లక యసత్యపాపము గట్టుకొందురేని దానితోఁబాటు స్త్రీహత్యాపాపమును గట్టుకొనుడు. నేనిదె నాశరీరమును భూమిపాలు సేసెదను. నాపలుకులు సత్యములని విశ్వసింపుడు" అని సంభాషించెను.

దమయంతి సంభాషణము వినియు, దన కృత్యము నెఱవేర్చుటకై మఱియొకసారి నలుడు సురేంద్రుని వరింపుమని యుపదేశించెను. అందులకుఁ దిరిగి యారాచపట్టి "వారు దేవతలు. నాకు బితృప్రాయులు. వారిని నేను వరింపనొల్లనని గట్టిగా చెప్పుడని తన నిరాకరణభావమును వెలిబుచ్చి, యాసురేంద్రదూతను బంపివైచెను. శీఘ్రముగ నాతడు దిక్పాలుర సన్నిధికి జేరి, దమయంతి సంభాషణమును సాంగోపాంగముగా జెప్పెను.

ఇంద్రాదులు దమయంతి యసమ్మతిని దెలిసికొని, "నలసార్వభౌమా! నీవలన దోషములేదు. నీకు సాధ్యముగాని పనిని నీ కప్పగించితిమి. నీవల్లనైనంతవఱకు జేసితివి. నీ సత్యధర్మములు మాకానందకరములైనవి. నీవు కావించిన న్యాయప్రచారమున కనుకూలముగ మేము నీయందు విశ్వాసముగలిగియుందుము. మాకై నీవు విశేషముగ నాయాసపడవలదని చెప్పి, నలుని హితోక్తులచే నాదరించి, తామా విదర్భదేశమున కొంక వంకఁ గావులై యుండిరి.

## 10 స్వయంవరము.

భీమనృపాలుఁడు కుండిననగరమును సర్వంబును మకరతోరణములచే నలంకరింపఁజేసి, సముచితాలంకారములతో నగరమును శోభిల్లజేసి యాయానగరములనుండి వచ్చిన రాజుల కెల్లరకును దగిన వసతి సౌధముల నేర్పాటు చేయించెను. నలుడు రథస్థుడై యూరిమధ్య వీధి కేగుదేర నాతని రూపసౌందర్యాదులం దిలకించిన జనులెల్లరును "ఇతడే దమయంతికి దగిన వరుడని చెప్పుకొనసాగిరి. విదర్భాధిపుడావార్తలను విని నలునకు దగిన సౌఖ్యముల నేర్పాటు సేయించి యాసౌధమున నే

యుండునట్లు చేసెను. శుభముహూర్తమున, రాజకుమారుల నెల్లరను, స్వయంవర సౌధమునకు రావించిరి. వారి వారికి దగినరీతి వరుసలలో నాసనము లొసంగజేసి యందు గూర్చుండజేసిరి.

దాదులు దమయంతికి మంగళస్నానము జేయించిరి. వసువు వలువలఁ గట్టించి, రత్నఖచితాభరణములతో నలంకరించిరి. మల్లెలు, విరజాజులు మున్నగు పూవులతో సరుల దురిమిరి. గండభాగములయందు మకరికాపత్రముల లిఖించిరి. రాచపట్టి పాదములకు లత్తుకబెట్టి, బుగ్గనొక కాటుక చుక్క బెట్టిరి. సువాసనాభరమగు గంధమును మేన నలందిరి. పుష్పాదులు చల్లిరి. అంత నొక ముత్యాలపల్లకిపై గూర్చుండబెట్టి, యిరుదెసల బరిజనులు వింజామరలు వీచుచుండ, మంగళవాద్యములు ఘోషింప పల్లవాధరులగు యింతులు పల్లకిని మోయుచు అత్యానందముతో భీమరాజు సమీపమునకు గొనివచ్చిరి.

భీమరాజు తన కుమార్తెను జూచి సంతుష్టాంతరంగుడై దాదులను జేరి కర్పూరాతులను దెమ్మని హారతులుదీసి, "నాముద్దుతనయా! గంటివే? ఇదుగో విజయముచేసి సుఖాసీనులై యున్న రాజు లనేకులు గలరు. ఈ రాజులయందు యే రాజు నీమనంబున కుచితంబని దోపబడుచున్నదో వారిని వరింపుము. ఈ పుష్పమాలికను చేత నందుకొ"మ్మని యివ్వ చమత్కారియగు దాది యొకతె "అమ్మా! దమయంతీ! అదుగో కంటివే? అతడు వంగదేశాధిపతి. అతని చెంతనుండువారు మత్స్యదేశాధీశుడు, అటువైపునుండువారు కాశ్మీరదేశాధిపతి. అతడుకర్ణాటరాజు, అతడు మగధదేశాధీశుడు, అతడు మహారాష్ట్ర భూపాలుడు, అతడు బర్బరదేశాధిపతియని ఇటుల యొక్కొక్కనివంక వ్రేలెత్తి చూపకయే చూపించుచు వారి వారి పరాక్రమాది గుణవిశేషములను వర్ణించుచుండెను. ఇంద్రాద్యష్టదిక్పాలకులు నలుని రూపములు దాల్చుకొని నలుని వలెనే యగపడుచు నలునిప్రక్కనే వరుసగా కూర్చుండిరి. దాది నవురు నలమగు రాజులవంటివారి జూచుచు వారిలో నెవ్వరో గ్రహింపజాలక ఖిన్నయుండెను. దమయంతి యీ కూర్చున్నవార లెవ్వరని యడిగెను. దాది నిషధదేశాధిపు డొక్కడే. వారిని నేను గుర్తెరుంగుదును. కాని వీరెల్లరును నలసార్వభౌమునివలె నగపడుచున్నందున నేనావ్యక్తిని ప్రత్యేకింపజాలకున్నా"నని బదులుచెప్పెను.

ఆ పలుకులు విని దమయంతి, "ఓహో! ఇవియన్నియు దేవేం
ద్రాదులు దెచ్చిపెట్టుచున్న చిక్కులు. నే నితరుల వరించి ఈ పుష్ప
దామము నొకని మెడలో వైచినచో వా రాగ్రహించి నన్ను గష్టముల
పాలు సేయవచ్చును. కావున వారి సమ్మతి నార్జించియే ఈ సుమదామ
మును నా యభీష్టవరుని కంఠము నలంకరింపజేయవలయును" అని యిం
చుక తర్కించి తన రెండు చేతులను జోడించి శిరమ్మును వంచి,
"ఓ యింద్రాదిదిక్పాలులారా! సర్వదేవతలారా! మీరు నిత్యసత్య
పదవి నలంకరించువారు. అనంతభోగముల ననుభవించువారు. మీ మీ
పుణ్యవశంబున మీరు సురలోకపాలకులయితిరి. నేను నరమాత్రురాలను.
మీరు మర్త్యులకు దండ్రులు. ఇహలోకమున మీకే పాపములు సేయక
నరకముల నాశింపక, పుణ్యమూర్తులకు వరమ్ములు సైత మిచ్చునట్టి
పుత్రికాప్రాయనగు నాయభీష్టము ప్రకారము వరుని జూపించు బాధ్యత
మీయందు గలదు. కావున నాయభీష్టపతిని నాకొనగూర్చి నన్నాశీర్వ
దించుడని పలుతెరంగుల మనసారఁ బ్రార్థించెను."

ఇంద్రాదు లామె మనోనిశ్చయమునకు హర్షించి తమ నలరూప
ములను వదలి, నిజరూపంబులం దాల్చి యంతరిక్షమున బ్రకాశింపుచు
"శాంతస్వరూపిణీ, శమదమాదిసద్గుణశాలినీ. ఓ దమయంతీ! నీ మనో
నిర్ణయమునకు మెచ్చితిమి. నీవు దీర్ఘసుమంగలివై యుండుము. ఇతఁడే
నలమహారాజు. నీ వితని పట్టపురాణి వగుము" అని యాశీర్వదించి,
శీఘ్రముగ వివాహమాడుమని యానతిచ్చి నిజనివాసమ్ముల కరిగిరి.

## 11. దమయంతి నలుని కంఠమున సుమదామము వైచుట.

భీమరాజపుత్రి సుమదామమును జేత నిడుకొని నిలువబడియుండ
నామె రూపలావణ్యాతిశయములను జూచి రాజు లెల్ల విభ్రాంతి చెంది,
"ఆహా! బాపురే?" యని యాశ్చర్యమునొందసాగిరి. ఈమె మానవ
మాత్రిగాదు. చంద్రకళావతారమని యొకండును, మించుదీవ కావచ్చు
నని యొకండును, రత్నదీపిక యని మఱొకండును, మరుని చేఁగోలయని
యింకొకఁడును, రతీదేవియే మనలఁ బరితపింపజేయుటకు వచ్చియున్న
దని మిగిలినవారును సంభాషింపనైరి. భీమనృపాలుడు చేసిన పూర్వ

పుణ్యఫలము ఫలించి యిట్టి సుందరాంగి నీతని యింట నుద్భవిల్లునట్లొనర్చినది. మనలో నొక్కడు దక్క యీమె సౌందర్యసౌకుమార్యములకు దగిన నరపాలురు లేరు. అతడే నలమహారాజు. అతని వంకనే యామె చూడ్కి నిలిపినది. అతని తనూ సౌందర్యప్రభ యీకమలానన ముఖమును వికసింపజేసినది. నలమహారాజు దరిజేర నామె యరుగుచున్నది. అహా! అతని భాగ్య మెట్టి దనవచ్చును. అతడే పుణ్యశాలి, అతడే నిజమైన భోగి. అతని యదృష్టమే నెఱవేఱును" అని పలుతెరంగుల సల్లాపములు గావించిరి. వినువీధిని దేవతాస్త్రీలు పూవులవాన గురిపించుచు శుభసమార్థములగు నినాదములు సేయసాగిరి. యక్షకింపురుషోరగగరుడాదులు గుములుగూడి యారతు లొసంగిరి. ఈ మహావైభవమధ్యమున దమయంతీకుమారి తన చేతి విరిదండను నలసార్వభౌముని కంఠమున నలంకరింపఁజేసెను. ఊర్వశి రంభ ఘృతాచి తిలోత్తమ మున్నగు నప్సరోంగనలు శుభగీతముల బాడుచు నాట్యముచేసిరి. అట్టితఱి సకల సురాసురులును సభాజనులును సుందరసుకుమారియగు దమయంతికి నలమహారాజె తగిన వరుడని యానందించుచు, కరతాళధ్వనులు గావించిరి.

ఆ యారావంబుల విని స్వయంవరాగతులగు నన్యభూపతులందఱును సిగ్గునొంది యొండొరుల మొగంబులు జూడనేరక, పై పచ్చడములు నేలకు వైచుచు, పదములు తొట్రుపాటుచెంద, భీమనృపాలునకు జెప్పకయే, వెడలిపోవసాగిరి. అంత విదర్భేశ్వరుడు పరమానందభరితుడై యల్లుడగు నలసార్వభౌమునకు కర్పూరహారతులర్పించి, మంగళవాద్యములతో నంతఃపురంబున నొక సమర్హమందిరమున విడిది చేయించెను. గగనతలమున దేవేంద్రుడు "నీ వంటిన నెల్ల పదార్థములును నమృతప్రాయములగుగాతయ"ని యాశీర్వదించెను. యమధర్మరాజు నీ దానధర్మతత్పరత్వ మభివృద్ధియై నీకు శుభదాయియగునని దీవించెను. వరుణుడా నలుడు అభిలషించిన తావునం దెల్ల బుణ్యతీర్థములు తోడై విలసిల్లునని దీవించెను. ఉమాసహితుండైన శంకరుడు "నీకు సకల సంపదలు గలిగి చిరకాల దాంపత్యసౌఖ్యము గలుగుగాత" యని యాశీర్వదించెను. శ్రీలక్ష్మీసహితుడైన విష్ణుమూర్తి, నలునిజూచి "నలసార్వభౌమా! నీకు అష్టైశ్వర్యములు గలుగునుగాత" యని యా

శీర్వదించెను. దేవతలందఱును నలదమయంతులదాంపత్యసుధానమునకు సంతసించి తమ తమ యధికారములకు దగినట్లు నూతన వధూవరులకు నానావిధములగు శుభాశీర్వాదమ్ములఁ నొసంగిరి.

## 12. నలదమయంతుల వివాహమహోత్సవము.

నలదమయంతుల కళ్యాణమహోత్సవమునకు నపూర్వశోభా విభాసమానమగు మంటపము నిర్మింపబడెను. పగడంపు గంబంబులును, పచ్చలతోరణములునుగల కాయమానములక్రింద వ్రేలాడు మాణిక్య ప్రభాద్యోతితములగు దివ్యదీపికావళులు చుట్టును నసమానకాంతుల నీన, దన్మధ్యప్రదేశమున వెలుఁగొందు మంటపమున గళ్యాణవేదిక యమర్చబడెను. పదునెనిమిదివిధమ్ములగు మంగళవాద్యములు మిన్ను ముట్టునట్లు మ్రోగ, నలదమయంతుల నాకళ్యాణవేదికపైఁ గూర్చుండ బెట్టిరి. వశిష్ఠాది మహామునులు మంగళాశీర్వాదగర్భితములగు మంత్రములం బఠించిరి. సుమంగలీ సముదయము కుంకుమ, పూవులు, కర్పూరము, కస్తూరి మున్నగు శుభద్రవ్యములు చేఁబూని, శుభగీతములు పాడిరి, నర్తకులు నాట్యములు సేసిరి. కొందఱు పడుచులు నలుగిడిరి. కొందరు గంధము బూసిరి. సంపంగితైలమున దంపతులకు నభ్యంగన స్నాన మాచరింపజేసిరి. పన్నీట జలకమాడించిరి. చీనిచీనాంబరములం గట్టించి, పట్టుపీతాంబరముల వల్లెవాట్లు వేయించిరి. రత్నఖచితములగు నాభరణంబులచే మేనుల నలంకరించిరి. కిరీటము, భుజకీర్తులు తొడిగి నలుని వేదికారూఢునిగావించిరి. ఆతనిపజ్జదమయంతిని గూర్చుండబెట్టిరి. నలమహారాజుచే నుమామహేశ్వరపూజయు, లక్ష్మీనారాయణాది దేవతా పూజలు చేయించిరి. వసిష్ఠ దమనకులు నాకలశాదిపూజలు చేయించిరి. మహర్షు లిరువురును హోమగుండమున కిరువంకల గూరుచుండి, నవగ్రహారాధనానంతరమున శుభసమయోక్తమగు హోమముం జేయించిరి. పదంపడి భీమనరపాలుఁడు దమయంతి చేయి నలునిచేత నిడి ముప్పదిమూడుకోట్ల దేవతలముందు, భూమి, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు చూచుచుండ నా కుమార్తెయగు దమయంతిని నీకు ధారాదత్తము చేసితినని వాక్రుచ్చెను, నలమహారాజు, అదృశ్య

రత్నమణులు పొదిగిన మాంగల్యమును దమయంతి గళమున నాభరణ ముగా ధరింప గట్టెను. మహర్షులు మహాపురుషులు నాశీర్వదించిరి. బంధు మిత్రపురోహితాదులు శుభాక్షతలు వేసిరి. ప్రేక్షకు లెల్లరు పూవులను జల్లిరి. పుణ్యాంగనలు మంగళగీతముల బాడిరి. ఇట్లు నలదమయంతుల వివాహము నిర్విఘ్నముగ మహావైభవముతో జరిగెను.

అంత భీమనరేంద్రుడు సమస్త బంధుమిత్రులను బంచభక్ష్యపర మాన్నములతో షడ్రసోపేతమగు విందు నారగింపజేసెను. ఎల్లరకును గంధపుష్పతాంబూలాదు లొసంగి గౌరవించి విడిదిస్థానంబుల కంపిం చెను. గాయకులు, నాట్యాంగనలు, తమ తమ సత్కారంబుల సంతుష్టి పడ గైకొని తమ వసతి నివాసంబుల కేగిరి.

నలదమయంతులు ఇంద్రాదులకు నమస్కరింప సంతసమున నా శీర్వదించి విమానారూఢులై నలుని సెలవుగొని పోవుచుండిరి. అట్టియెడ శనైశ్వరు డతివేగముతో బరువుపర్వున వచ్చుచుండెను. గమనవేగ మున నతని మొలవస్త్రము వదులయ్యెను. కప్పువస్త్రము జారెను. శిఖ ముడి విడివడెను. అట్లు రొజుచు బరువిడు శనైశ్వరుని జూచి యింద్రుడు "నీవొక అత్యవసరకార్యమున బోవుచున్నట్లగపడుచున్నావు. ఆ కార్య మేమని యడుగ, సూర్యనందనుడగు నాకలిపురుషుడు చిరునగవుతో, "దేవాధీశ్వరా! విదర్భదేశాధిపతియగు భీమనృపాలునికుమార్తె దమ దమయంతికి స్వయంవరమని చాటించిరి. నేడే యామె స్వయంవరమట. నేనేగి యామెచే వరింపబడి యామెను వివాహమాడ నిశ్చయించుకొని యచ్చటి కరుగుచున్నాడను. ఆలసించుట కవకాశము లేదు. శీఘ్రముగ సెలవొసంగు" డని పలికెను.

ఇంద్రాదు లాతని మాటలు విని "ఓయీ! కలిపురుషా! నీయం తటి యాలోచనాపరుని నే నెందును జూడలేదు. ఇన్నిదినములనుండి నీ వెందుబోయితివి? నీ దురదృష్ట మిట్టిదే" అని కరతాళధ్వనులు సేసి పక పక నవ్విరి.

## 13. కలిపురుషుఁడు విదర్భకు వచ్చుట.

మఱియు, "ఓకలిమహారాజా! ఇంతకాలముదనుక మీ రెందులకు బోయితిరి? మీ యదృష్టము సరిగాలేదు. మేమందఱమును మా మా వాహనాదులతోడను, ఇతరాలంకారములతోడను మహాడంబరముగ స్వయంవరమున కేగితిమి. మారూపసౌందర్యాదు లాదమయంతికి నచ్చలేదు. మావలె నెందఱో భూపాలురును విచ్చేసిరి. అందఱకును నవమానము వాటిల్లినది. ఆ దమయంతి భూలోక దేవేంద్రుడని పేరొందిన నలసార్వభౌముని వరించినది. వారలిరువురకును గళ్యాణమహోత్సవము నేత్రానందకరముగ మహావైభవముతో జరిగినది. ఇదిగో! చూడుము. మాకొసంగబడిన గంధపుష్పతాంబూలములని చూపిరి. తోడనే కలిపురుషునకు గడవు మండి మహాగ్రహ ముదయించెను. "ఔరా! నేను దమయంతిని వివాహమాడి, యామెతో ఉపవనవిహారమ్ములగా వింతునని పేరాశతో పరుగిడెంచుచుంటిని. నాయాశనిరాశయయ్యెనా? దమయంతి కెంత గర్వము పట్టినది. దిక్పాలురను దేవాంశవిరాజితులను విడిచి, కేవల మొక నరమాత్రుడగు నలుని గోరినదిగా? నరునిప్రేమాల మిమ్మవమానించిన యాయువతి పొగరుదీయకయే వెడలుచుంటిరా?" అని పండ్లు పటపటగొఱకి, గుడ్లెఱ్ఱజేసి, జడలు మేనెల్ల విడిబాఱ, దశదిశలు నొక్కుమ్మడి యుఱిమిచూచి, "యాదంపతు లేమాత్రము సుఖించెదరో చూచెదనుగాక. నలుడైన నమకేందు గౌరవముంచవలదా? ఒక యువతికొఱకు దేవలోకాధిపతి నవమానించునా? నలునిపరాక్రమశాలియని భావించి వరించినది కాబోలు దమయంతి, ఆతని పరాక్రమమును బరాక్రమమేనా? శంకరాదులైన నాపరాక్రమము మ్రోల నిలువలేక గజగజవడకుదురని యెఱుంగరు గాబోలు. మంచిది నా సామర్థ్యమును చూపుటకు సమయము వచ్చినది. దిక్పాలురగు మీకు గలిగిన యవమానము నాకు మాత్రము గలిగినట్లుగాదా? మీ మనస్సుల కెట్టి కష్టముగలిగెనో యట్టి కష్టములను వారి మనస్సుల కనతికాలమున గలుగజేసెదను. లోకుల దృష్టిలో నలున కీనాడెంత గౌరవముగలదో యింక నంత నగౌరవము చుల్కదనము గలుగునట్లు చేసెదను. నా ప్రతాపమును జవి చూచెదరు గాక" యని చండప్రచండ సంభాషణము

సేయు శనైశ్చరునిజూచి యింద్రుడు "సూర్యనందనా, నలసార్వభౌముని నీ వే విధమునఁ బరాభవింపఁగలవో చెప్పెదవా ?" అనెను. అపుడు శనైశ్చరుఁడు "సురేంద్రా ! ఇటు వినుము. నామాయాప్రవర్తనమున నరాధిపునకు సమానుడగు నొక రాజు నాతనియొద్దకుఁ బంపి ద్యూత మాడించెదను. జూదమున సర్వముదు గోలుపోవునట్లు సేసి, భార్యను విడిచి, తనకు కష్టముగట్టు నొక్క సామంతరాజ పాకశాలలో పాకము గావించు సేవకునిగాఁ జేసెదను. చట్టి చేతి కిచ్చి వాని రూపము వికృత మగునట్లుగా మార్చివైచెదను. మీకు గలిగిన యవమాన వ్రణము మాన్పి మీకు మనశ్శాంతి కలుగజేసెదను పొం" డని వారికి సెలవొసం గెను. తాను విదర్భదేశమున కేగి, భీమనరేంద్రుని యంతఃపురమున నొక ప్రత్యేక గృహమున నివసించుచున్న నలమహారాజు నొద్ద కరు గుట కొఱకు విప్రవేషము ధరించుకొని లోనికిం బ్రవేశించి నలచక్ర వర్తిని జూచెను. నలుని శమదమాది సద్గుణగణంబులు, బ్రాహ్మణసేవా పరాయణత్వము, పెద్దలయందు భక్తి, పిన్నలయందు ప్రేమభావము, సాధుసజ్జన సేవాసక్తి, సన్మార్గప్రవర్తనానురక్తి, సత్యధర్మాసక్తి ము న్నగునవి సూర్యనందనుని మనం బాకర్షించెను. ఇట్టి యుత్తమపురుషు నకు గీడు సేయుట ఎట్లా ? యని కొంతతడవు చింతించెను. అట్లొనరింప మార్గము గానరాక తగుకాలముకొఱకు నిరీక్షించుచుండెను.

కొంతకాల మానలసార్వభౌముడు దమయంతినిగూడి సుఖంబుల దేలుచు, నామెయం దత్యంతానురాగసమన్వితుడై యుండెను. దమయం తియు నలునియం దనురాగసమన్వితయై దగురీతి సపర్యలు సేయుచు నాతని మనంబు గరుగఁ బ్రియసంభాషణము సేయుచు మహానంద మను భవించెను.

ఇటులుండ నొకదినమ్మున, నలునకు దన రాజ్యమునందలి ప్రజ లెట్లుండిరో, తన బంధుమిత్రు లెంతగా నెదురుచూచుచుండిరో యని విచారణ సేయ మొదలిడెను. దమయంతిని బిలిచి "ప్రాణేశ్వరీ ! మన మిచ్చట నెంతకాలమున్నను, నీ తలిదండ్రులకు బరువుగాదు. తమ్మకై తాము మీకెంక మీరాజ్యమునకు బోవమ్మనని చెప్పను. పురజను లు

మనయం దత్యంత వాత్సల్యముగలవారై, యెల్లవిధముల నానందపఱ
చుచు మన రాజ్యమునే మరచునట్లుగా ప్రవర్తించుచున్నవారలు. మన రాజ్యమ్మునందుగల ప్రజలు, మంత్రులు, పురోహితులు, బంధుమిత్రులు ఎల్లరును మనకై నిరీక్షించుచుందురు. మన రాజ్యమునకు బోక, మన పరిజనులకు మనము బ్రేమ జూపకయుండుట యుక్తముకాదు. ఎప్పటికైనను మనము నిషధదేశాధీశులము గాని విదర్భదేశాధీశులము గాజాలము. కావున శీఘ్రముగ మీతలిదండ్రుల యానతిగొని మనము నిజ రాజ్యమ్మునకరుగుట యుచితమని నా యభిప్రాయము. ఇంక నీమనోభీష్టము విన( బల్కుము" అనెను. అనవుడు భీమరాజతనయ, "హృదయేశ్వరా! సత్యము. వారెల్లరు మీరాక కెదురుచూచుటసహజము. అందునను నేను మీకు నూతనముగా వివాహితనైనందున నెందరో ప్రజలు నన్నుగూడ జూడ నిచ్చగించుచుందురు. మీ రాజ్యమే నారాజ్యము. మీ స్వాతంత్ర్యమే నాస్వాతంత్ర్యము. ఈ విధానము నెఱింగిన నాకు నిషధదేశమునకు బోవలయునను సంకల్పముగలిగినది. కాని తమయానతి కాక ముందు నే ననుట ధర్మము కాదని మిన్నకయుంటిని. నే నింక నాతల్లిదండ్రులకీ వార్త వినిపించి వారి సెలవు గైకొనివచ్చెదను" అని ప్రత్యుత్తర మొసంగి తన జననియొద్దకు బోయెను.

ఆమె రాకనుజూచి తల్లి "నేడేలనో యసాధారణముగ దమయంతి ఒక యాత్సుక్యమునవచ్చినట్లు తోచుచున్న"దని మనంబున దలంచెను. దమయంతి నామెకు నమస్కరించి "తల్లీ! నేను వివాహితనై పెద్దకాలమయినది గదా? పుట్టినింట( బెద్దకాలముండుట యువతులకు నుచితముగాదు. మీ యానతి మీరజాలక, యింతవఱకు ప్రాణేశ్వరుండును, నింటనే నివసించియున్నవాడు. పుట్టినింటికి గౌరవముగూర్చినదే పుత్రిక గాని యగౌరవముచూర్చినది సత్పుత్రిగాదు. కృపసేసి నన్ను నా ప్రాణేశ్వరునితో నిషధదేశమునకుం బోవ నానతి యొసంగుమ"ని పలికెను. ఈ వార్తను వెంటనే భీమరాజునకుం దెలిపి, యాపె, యల్లునకును కూతునకును సెలవొసంగి నిషధరాజ్యమునకు బంపుడని చెప్పెను. తమను విడనాడి దమయంతి దూరమేగుచున్నది గదా యను విచారము భీమరాజునకును నాతని పట్టమహిషికిని మెండుగ గల్గెను. ధైర్యము

వహించి సుమూర్తైన బంపుటకు నిశ్చయించుకొనిరి. పదంపడి విదర్భాధిపతి నలమహారాజునుదనయొద్దకు బిలిపించుకొని "నీయర్థాంగియగు దమయంతిని జేకొని శుభపరంపరాభివృద్ధి గాంచుచు నిషధరాజ్యము నేలుకొమ్మని పలువిధంబుగ సంభాషణము సేసెను, మఱియు, రత్నమణిఖచితములగు సువర్ణాభరణములను జీనిచీనాంబరములను రథగజతురంగాదులను, అంతఃపురంబును బుష్కలముగ నలునకొసంగెను. కూతునకు వలయు రత్నాభరణములను, చీనాంబరములను, జరీపరిధానములను పెక్కు లొసంగెను. సేవార్థమై పెక్కుమంది దాసదాసీజనుల నంపెను. కవిగాయకులు వెంబడింప భేరీమృదంగాది మంగళవాద్యములతో బురవీధులం ద్రిప్పించెను.

తానును గొంత దవ్వు దనుక నలదమయంతుల సాగనంపి, నిషధ మార్గము నంటఁజేసి. భీమరాజు స్వస్థానమునకుఁ జేరెను. నిషధేశ్వరుడు విదర్భదేశపు మంత్రికిఁ దగురీతి హితవచనములు చెప్పి, పురోహితాదులకు సత్కారములొసఁగి, తక్కుంగల పురజనుల కెల్లరకు దగురీతిఁ బారితోషికము లొసంగి అందఱియొద్దను నానతి గైకొని నిషధపురంబునకు బయనమయ్యెను.

నలసార్వభౌముడు నిషధానగరమునకు బయనముగానున్నయపుడే తన మంత్రులకు వర్తమాన మంపియుండుటచే, దోడ్తోన నగరమంతయు మకరతోరణములు గట్టించి, యెందెందుఁ బచ్చని లతాకాయమానము లమరించి మంత్రిపుంగవుండును, సైన్యాధిపతియు, నితరులగు సర్దారులును సార్వభౌమునకు స్వాగతమొసంగ సర్వసిద్ధముగ నుండిరి. దమయంతీదేవి పసిడిపాలకిపై నధివసించి, వేశ్యలు నర్తనములు సేయ, గాయకులు వీణాది సుస్వరములఁ బాటలుపాడ, వెనువెంట సార్వభౌముడు నరుగుదెంచుచుండ, సేనాదళము లిరువంకల బారులుదీర్ప, భేరీఢక్కాది విజయసూచక నినాదమ్ములు నింగిని జెంగలింపఁ బురమున బ్రవేశించి యల్లనల్లనఁ బురోత్సవప్రాయమున ముందుకు నడుగిడసాగెను. పుణ్యాంగనలు తమ గృహద్వారముల నిల్చి రత్నాలపళ్ళెరములయందు కర్పూరహారతు లొసంగిరి. ముత్తైదువలును భూసురపుంగవులును నిరుదెసలనుండి సేసల జల్లిరి. మంత్రిసామంతనరేంద్రు లెదురుగ వచ్చి పరాకులు చెప్పి, నమ

నాట్యములతో స్వాగత మొసంగిరి ప్రజలు గావించు నమస్కారములకు నలు డానందమునఁ బ్రతి నమస్కారములు సేయుచు నరిగెను. ప్రజలును, బంధుమిత్రులును, ఉద్యోగగణంబులును ముస్తే వెంబడింప దమయంతీ సమేతుడై నలమహారాజు రాచనగరిలోఁ బ్రవేశించి, యంతఃపురిం జేరి సుఖాసీనుఁడయ్యెను. తనకు స్వాగత మొసంగ వచ్చిన సర్వజనులకు ధనకనకవస్త్రాభరణంబులచే బహూకరించెను. పురజనులకును, సామంతనరేంద్రులకును, తదితర భూవరేణ్యులకును నాహ్వానములంపించి షడ్రసోపేతమగు భోజనముపెట్టించి గంధపుష్పతాంబూలాదులచే సత్కరించి స్వస్థమానసుడై రాజకీయ విషయముల విచారించుకొనసాగెను.

దమయంతి కంతకపురమునంగల సౌధరాజములలో నుత్తమావకాశములుగలదానిని నివాసంబున కొసంగిరి. అందు స్వర్ణడోలికా సముదాయములును, ముందు వెనుకలఁ బూవుతోటలును, భూమినుండి జలధారలు వెలికి గ్రక్కు నీటిగొట్టములుగల కేళాకూళులును, బృందావనంబులును బెక్కులుండెను. ఆపె జననీజనక వియోగక్లేశము నడంప, చెలికత్తియలు ఎడతెగక ముచ్చటలఁ బెట్టుచు, వివిధ వినోదములఁ గాలము గడుపజేయుచుండిరి. ఈవిధంబున దమయంతి కొలదికాలముననే బహుకాలమునుండి కాపురము సేయుచున్నదానివలెఁ గార్యాసక్తిబూని యాంతరంగిక వ్యవహారములలో దాను నుదారబుద్ధితో వ్యవహరింపఁ జొచ్చెను. సత్యధర్మపరికాళము సేయుచు దనతోడివారలకెల్లసద్గుణప్రబోధము గావింపజొచ్చెను. నలదమయంతు లుభయులయ్యుఁ బ్రాణములు మానసంబు లొక్కటియో యనునట్లు ఎడతెగని పరస్పరానురాగముతో నుండి శృంగారవనంబుల డాగుచు, స్ఫటికశిలాసౌధంబుల నధివసించుచు, హంసతూలికాతల్పంబుల గూడుచు, స్వర్ణడోలికాంతరముల నూగాడుచు, మనోభీష్టానుసారముగా విహరించుచు సంపూర్ణప్రమోదంబునఁ బ్రొద్దులు పుచ్చుచుండిరి. నలదమయంతుల పరస్పరానురాగము దంపతులకు నీతిదాయకమయ్యెను.

గీ॥ పసిడిలో రత్నరాజి యేర్పడినయట్లు
చందమామను రోహిణి పొందినట్లు

అంగజునకు రతీదేవి యలరినట్లు
అలరె నలునకు దమయంతి హర్షధాత్రి॥

ధర్మనందనా! వింటివిగదా? ఇట్లనుపమానోన్యోన్యరాగాస్పదులైన నలదమయంతులు సర్వసౌఖ్యములం దేలుచున్న సమయమున గలిపురుషుడా పుణ్యసాధ్వి యొక్క దినమున్నైన నేకాంతముగా నున్నపుడవలోకించి తత్సౌందర్యసమాకృష్టచేతస్కుడై, తనలో నిట్లనుకొనెను.

"ఇట్టి సుందరాంగిని వివాహమాడని జన్మమేల? పుట్టితిని గాని నా పుట్టువు సార్థకముగాదు. సమస్త దేవతలను, రాక్షసులను, నరులను యిన్నియేల సకల ప్రాణులను పిండి పిండి చేయగల సామర్థ్యము నాకు గలదు. కాని యేమి ప్రయోజనము. లోకోత్తర సౌందర్యముగల యీ రమణీరత్నమును సామాన్య మానవుడు సంగ్రహించినాడు. నాతండ్రియగు సూర్యుడు భగవదంశావతారము. త్రిజగత్ప్రదీపనుడు. అట్టివానికి బుత్రుడనై నాజన్మము సార్థకము సేసికొంటిని. అదియట్లుండ నేనీనలుని గుణాతిశయములను విచారింపక, యింద్రాదులమోల నేమేమో ప్రసంగించి వచ్చితిని. అక్కటక్కటా! మోసపోయితిని. ఈ నలుడు అవక్ర పరాక్రమసంపన్నుడు. సత్యధర్మపరాయణుడు. ఎల్లవేళలం బ్రజాహితము గోరును గాని స్వార్థాభిలాష యించుకేనియు దాల్చి యెఱుంగడు. ఇట్టి వానిచెంత జేరుటెట్లు? చేరియు నాతని మోసగించుటెట్లు? అని యాలోచించి తుదకుం గలి "యీతండు నియమకాలము విడిచియుండు సమయమున నీతనిపైకి సోకి మోసపుచ్చెదను గాక!" అని నిర్ణయించుకొని యొక్క నిముసమేని యెడతెగక, తగుసమయము కొఱకెదురు చూచుచుండెను.

ఇటులుండ నొక్కనాటి వేకువజామున నలమహారాజు, నిదుర లేచి, పాత్రనిండ నీరం గైకొని, బహిః ప్రదేశమునకుబోయి కూర్చుండి దేహబాధ దీర్చుకొని, చెంబెడు నీళ్ళతో శుద్ధిగావించుకొనెను. అట్టియెడ నతని కాలి మణికట్టుపైన సూది మోపినంతటి పరిమాణముగల ప్రదేశమున నీరంటక పొడిగా నుండెను దానింజూచి, సమయమునకై నిరీక్షించుచున్న శనైశ్వరుడు నలుని కాలి మణికట్టుపై సోకెను. ఈ విషయము

దెలిసికొనకయే నలుడు వినమ్రముగఁ జేయు కాలోచిత క్రియలను దీర్చుకొని, తన నివాసస్థానమున కరిగెను.

కొంతకాలమునకుఁ బరమాత్ముని యనుగ్రహమువలన దమయంతీ గర్భవతి యయ్యెను. దాసదాసీజనంబు లామెకువలసిన యుపచారము సేయుచు నామె యారోగ్యమును బాగుగా గాపాడుచు దినములు గడపిరి. తగు సమయ మాసన్నమైనంత దమయంతి యొక కుమారు డుదయించెను. నలమహారాజు పరమాహ్లాదభరితుడై వశిష్ఠుల రావించి కావలసిన సంస్కారంబులు చేయించి బంధుమిత్రుల రావించి, షడ్రసోపేతములగు భోజనము లమరించి, ప్రేక్షకులకు నేత్రానంద బు గావించెను. పుత్రు డుదయించిన కొన్ని దినంబులకు బుత్రిక యుదయించెను. తిరిగి పరమానందభరితులై నలదమయంతులు పౌరులకెల్ల నింటివరుసగు బసుపుకుంకుమ పండ్లు మున్నగునవి పంచిపెట్టించిరి. నగరములోని పుణ్యాంగనల కంకణములను జీరెలను భూసురులకును బండితులకును ధోవతులను చాపులను బంచిపెట్టించెను. పౌరుల నెల్ల బిలిపించి బీదల కందఱకు నన్నదానమును వస్త్రదానమును జేయించి జగదానంద మొనరింపఁ జేసిరి. నలదమయంతు లిట్లు సిరిసంపత్తులు గలిగి, సామంతరాజులు సమయములో గప్పంబులు చెల్లింప గ్రహించుచు, జగదానందకరముగ రాజ్యపాలనము సేయుచు సంతోషసాగరమున నీదులాడుచుండిరి.

## 14. శనిచర్యారంభము.

అక్కటక్కటా! శని నలమహారాజు మెయిపై సోకిన క్షణము మొదలుకొని, యాతని చిత్తము ధర్మేతరచర్యాభిలాషచ్ఛాయం దిరుగాడ నారంభించెను. పరహింసా చర్యల నెంతయు సేవగించుకొను నాధర్మపరాయణుడు కర్మబద్ధుడై మృగయావిహారమున మనసుపెట్టెను. ఒకనాఁడు మంత్రిసామంతులను బిలిపించి వేటాడుటకై యడవికిఁ బ్రయాణము సేయించెను. తురంగములనుగట్టిన యరదముపై దమయంతిని గూర్చుండఁజేసెను. తా నొక గొప్ప యశ్వముపై నారోహించెను. సామంతరాజులు సైన్యాధికారులు ముందు నరుగుచుండిరి. వేటకాండ్రు

వేట సేయ నాజ్ఞాపించెను. వేటకాండ్రు బాణములు, కటారులు, గండ్ర గొడ్డండ్రు ఈటెలు మున్నగు నాయుధములు గొని, కొందఱు సేవకులు తప్పెటలు గొట్టి పెద్ద నినాదములు సేయుచుఁ గేకలువైవ, పొదరిండ్ల యందును, నదీతీరములయందును, గుట్టలయందును, గుహలయందును, మిట్టలయందును లోయలయందును సంచరించుచున్న సింహశార్దూలాది క్రూరమృగంబులను రాజరాజు ముందునకు బోవునట్లుగా వలయాకారమున గ్రమ్మి తోలసాగిరి. నలమహారాజు శని స్పర్శాపూర్వకాలమున గలిగియుండిన జీవకారుణ్యము మఱచి, కాలయముని తీవ్రతవహించి, తన మ్రోలకు వచ్చిన క్రూరమృగంబులపై వాడియమ్ములు బ్రయోగింప సాగెను. కొన్ని మృగంబులకు గాళ్లు తెగెను కొన్ని మృగంబులకు పొట్టలు పగిలి, ప్రేగులు జాఱి నేలఁబడెను. కొన్ని మృగములు దెబ్బలు తిని నారాజును శరణము వేడుటకోయన్న చందంబున మతిభ్రాంతిచెంది యతని మ్రోల నిశ్చేష్టయై నిలిచెను కొన్ని జంతువులు నలమహారాజునకు సౌఖ్యానుభవకాలంబు వెడలిపోవుచున్నదని తెలుపుచున్నవోయను యనునట్లు కాననమెల్లఁ బ్రతిధ్వనించి బొబ్బలిడసాగెను. మత్తగజంబుల తొండములబట్టి యూపుచు, కుంభస్థలంబుల జీల్చుచు, ఖడ్గాదిమృగంబుల జీల్చుచు జవ్వాది పిల్లులను, బుసగుపిల్లులను, జింకపిల్లలను దెచ్చి రాజు మ్రోల నిడుచు, వేటకాండ్రు తమ తమ పరాక్రమముల కొలది విజయ ప్రకటనము సేయుకొలంది శనిగ్రహాబద్ధ నలసార్వభౌముడు పరమానందము జెందుచు, వారలకు ధనములు, వస్త్రములు బహుమతులుగా నిప్పించుచుండెను. శనిగ్రహామాత్సర్యమ్మున నస్మృతహృదయుడైన నలమహారాజు చిత్తము ధర్మతత్పరతయు నిట్లు మాఱిపోయెనని బృహదశ్వుడు వాకొనునప్పుడు, ధర్మనందనుడు, మునికులతిలకా, నలుడు దమయంతీ సహితుడై సుఖంబుండువాడు రాజ్యము నెట్లు కోలుపోయెనని ప్రశ్నింప బృహదశ్వమహర్షి క్రమ్మఱ నిట్లు చెప్పదొడంగెను.

## 15. నలుని ద్యూతఖేలనము.

కలిపురుషు డొక దినమ్మునఁ దన కార్యము సాధింపనెంచి మహా కోపమ్మున నొక బ్రాహ్మణ స్వరూపముదాల్చి, పుష్కరరాజునొద్దకుఁ

బోయెను. పుష్కరుఁ డాతని మొగమున్ గాఁజూచు సమయమున శనైశ్చరుఁడు "రాజేంద్రా! నేను సూర్యకుమారుఁడను. నన్ను శనైశ్చరుడందురు. బ్రాహ్మణరూపమున నీయొద్దకు వచ్చితిని. నాకేమియో కావలసి యర్థించ వచ్చితినని భావింపవలదు. నాకొక పనియున్నది. దానిని నీ సహాయమున నిర్వహింపఁదలచినాఁడను. దానిం జెప్పెదను, ఆకర్ణింపుము.

"ప్రపంచమున నా ప్రతాపము ప్రసిద్ధము. నన్ను గెలంపనివారు లేరు. ఛాయాదేవి వరప్రసాదమునొందినవాఁడను. నేనొక కార్యము సాధించి యింద్రాదులకు మనశ్శాంతి సేసెదనని శపథముసేసి వచ్చినాడను. నేను దొలుతటినుండియు విదర్భరాజ పుత్రియగు దమయంతిరూపలావణ్యాతిశయములను విని. యామెను బెండ్లిసేసికొననిశ్చయించి పేరాశతోఁ గాలమునకై నిరీక్షించుచుంటిని. కాని యాయువతి యీడేరి స్వయంవరమును బ్రకటింపఁజేసి: యందుల కరుదెంచిన దిక్పాలకుల నైతము నిరాకరించి, నిషధాధీశ్వరుండగు నలమహారాజును వరించి పుష్పదామము నాతని కంఠమున వైచెను. నే నాస్వయంవరమునకు బోవుచు మార్గమున నే యీవృత్తాంతము కర్ణకఠోరముగ నాకువినఁబడినది. గర్వభూయిష్ఠయగు నాదమయంతిని, నలునుండి యెడబాపి, వారికి వియోగబాధ గలుగఁజేసి, ముప్పుతిప్పలు పెట్టుటకు నేనింద్రాదుల మనశ్శాంతికై శపథముసేసి వచ్చితిని. అట్లు సేయకుందునేని నాపరాక్రమము వ్యర్థము. నాతల్లి వరసత్వము కల్ల. నాతండ్రియగు సూర్యుని జగత్ప్రకాశకత్వము నిరుపయోగము నీకును నలమహారాజునకును నెయ్యముగలుగ జేసెదను. నాసామర్థ్యముచే నాతఁడు స్వయముగా నీ నేస్తము గావించు నట్లు చేసెదను. నీ వాతనికిఁ గప్పముగట్టువాఁడవను భీతి నించుకయు నుంచుకొనవలదు. నీవు నిర్భీతిగా సంచరించుము. ఆతనిని నిషధరాజ్యము నుండి వెడలజేసి యారాజ్యపు సుఖంబులనెల్ల నీచే ననుభవింపఁజేసెదను తత్క్షణమే బయలుదేరుము. వెడలుమ"ని యుద్బోధించెను. పుష్కరుడా కలిపురుషునకు నమస్కరించి "మహానుభావా! సూర్యనందనా! నిన్నొక బ్రాహ్మణరూపమున నున్నప్పుడు చూచిన మాత్రాననే నా గుండె బ్రద్దలై పోయినట్లున్నది. ఇఁకఁ దను నిజరూపమే నాకండ్లఁ బడినచో నా స్థితి యేమగునో యూహింపజాలను. మహానుభావుఁడవు. మహా

తేజస్వివి. కేవల మా సూర్యభగవానుని యంశమున బుట్టినవాఁడవు. నీ వంటి మహానీయుని సందర్శనము, మహాంతరముననైనను, నాకబ్బుటచే నా జీవితకాలములోఁ గలిబాధ నన్నంటదని విశ్వసించుచున్నాను. మీరు నా కతనిని మిత్రునిగా జేసెదరుగాక. అతని రాజ్యము నాకెట్లుల బడునో తెలుప వేడెదను.

"పుష్కరా! వినుము. నీవాతని చెంతనున్నప్పు డిష్టాగోష్ఠి జరుపుచు ద్యూతము నాడఁ బ్రేరేపించుము. ఆ జూదమునాడుట కిచ్చగించునట్లు నే నాతని మతిం ద్రిప్పెదను. జూదము నాడునప్పుడు పాచికలలోఁ బ్రవేశించి పందెములు నీకు విజయము గలుగునట్లుగా బడఁజేసెదను. అతఁ డోడి, రాజ్యమును సంపదయు నీవశము సేయును. అతఁడు సత్యపరివర్తనుడగుటచే, పందెము నొడ్డి యోడిన వెనుక నత డసత్యమాడక రాజ్యము నీ స్వాధీనముచేసి యడవులకు బోవును" అని వాఁడిచ్చిన కలిపురుషుని యుక్తికి సమ్మతించి, పుష్కరుడు, రత్నాభరణములను దాల్చి రథారూఢుఁడై నిషధరాజ్యంబున కరిగెను.

నలసార్వభౌముఁ డాతని బ్రియంబున నెదుర్కొని, తన యంతఃపుర సౌధంబునకు గొంపోయెను, మఱియు రత్నాలంకృతంబగు నొక యాసనమునఁ గూర్చుండబెట్టి సముచితరీతి సత్కరించి, మజ్జనమాడజేసి షడ్రసోపేతమగు భోజనమును గుడువబెట్టెను. భోజనానంతరమున నొక సువర్ణసౌధమునకు గొంపోయి తాంబూలము సమర్పించి, యాతనితో నలుడు ఇష్టప్రసంగము సేయ నారంభించెను. ప్రసంగమధ్యమునఁ బుష్కరుఁడు, "రాజేంద్రా! మనము పగడసలాడ కొందుమా"యని ప్రసంగించెను పూర్వపుణ్యలబ్ధమహాజ్ఞానభాగియగు నలచక్రవర్తి యిది తగని పని యని కొంత తడవు వాదించెను. కాని యాపఃకులను నిరోధించుచు బుష్కరుఁడు "అయ్యా, ప్రొద్దుపుచ్చుట కేదో ఒక వినోదము కావలయునని కోరుచున్నాను. నా ప్రార్థన నంగీకరింపుము"ని బలాత్కారము సేసెను. కలిప్రేరితుఁడైన నలుఁడు, తన మిత్రుని మనంబు కిష్టము సేయవలయునని, జూదమాడుటకు సమ్మతించి, సేవకుఁ బిలిచి పగడసలు దెప్పించెను. నలపుష్కరు లంత జూదమునాడ నారంభించిరి. తొలుదొల్త నుభయులును ముంజేతి కంకణములను బందెము వెట్టి యాడసాగిరి. తొలుపటి

పందెమునఁ బుష్కరుఁ డోడుటయు, నలమహారాజు విజయమునొంది కం కణములను గెలుచుకొనుటయు దటస్థించెను. అప్పుడు కలిపురుషున కాగ్రహ మధికమై పాచికల యందుఁ బ్రవేశించి యక్రమచర్య నారంభించెను. రెండవ పందెమ్మున ముక్తాహారము లొడ్డుపెట్టబడినవి. నలుఁడోడి పుష్కరుఁడు గెలుచుటచే నవి పుష్కరుని స్వాధీనమయ్యెను. పదంపడి యొడ్డబడిన పందెములం దెల్ల నలున కపజయముగలిగి తన రత్నాభరణము లెల్ల నలుడు పుష్కరుని వశము చేసెను. తరువాత నలుఁడు తన బొక్కసమునంతయును బుష్కరున కప్పజెప్పవలసి వచ్చెను.

## 16. జూదము వలదని నలునకు పౌరుల యుద్బోధ.

ఈ వార్త ప్రజల వీనులంబడి, రాజ్యమునందంతటను హాహాకారములు ప్రారంభమాయెను. "ఆహా! ఇప్పటికే యింతయైనది. మహారాజు ద్యూతమునాడుట నిలుపకున్నచో నింకను నేమి ముప్పువాటిల్లునో యని ప్రజలు భయభ్రాంతులై రాజా! జూదమువలదని సమీపించగలవారు బోధింపసాగిరి.

"రాజేంద్రా! నీవు శిష్టపరిపాలనంబును దుష్టశిక్షణమును జేయుచు రాజ్యము నేలుచున్నవాడవు. ఇంతవఱకు మేము మీబిడ్డలవలెనుండి మీయాదరమున సర్వసౌఖ్యముల ననుభవించుచున్నారము. ఇప్పటికాభరణములు పోయినవి. ధనాగారము పరుల స్వాధీనమయినది. మంత్రిపురోహితాదులు తమ యాన కెదురాడలేక మిన్నకున్నారు. ప్రజలము మేము మీబిడ్డలవంటివారము. మేము చేయు హితబోధ విని ఈజూదము నాడకుము. కులగురువులగు వసిష్ఠమహర్షి తమయొద్దలేరు. మీకు నీతి జెప్పుటకుఁ బ్రధానులును నుద్యోగులును జంకుచున్నారు. మీరు సంపూర్ణవైభవముతో నుండనిచో, నా కోపము ప్రజలమగు మాపై విసరుకొనును. కావున నీ ద్యూతము నాపి మమ్ము గాపాడుమ"ని ప్రజలు పలు తెఱంగున నయబోధ చేసిరి. కాని శనిచర్యాపీడితుడైన మహారాజు కన్నుల నెఱ్ఱజేసి "మీరు నాకు నీతి సెప్పువారా? అవలకుఁ బొండు, అంతఃపురమున కేల వచ్చితిరని కోపమున బ్రసంగించి, యొక సేవకుని బిలిచి "ఓయీ! నీవు వీరి నెల్లరను నంతఃపురమున కేల రానిచ్చితివి,

బయటికంపివేయుమని యానతిచ్చెను. ప్రజలు ఇది యెల్లయుఁ గర్మ ప్రాప్తమగు కలిమాయకు ఫలితము. ఇఁక నితఁడెవ్వరు చెప్పినను విన జాలడు. చెడుకాలము దాపరించినప్పుడు హితవాక్యములు చెవులం జొరవు. మన కర్తవ్యము నెఱవేర్చుకొంటిమి. అతని కర్మఫలము నతఁడే యనుభవింపగలఁడు. మనము చేయగలిగిన దేమియులేదని వారెల్లరును నంతఃపురంబు వీడి విషాదక్లిన్నముఖులై బయలుపడిరి.

## (17) దమయంతి పుత్త్రుని బుత్త్రికను విదర్భకంపుట.

క్రమముగ నీవార్త దమయంతీ దేవికి దెలిసెను. అప్పటి కప్పుడే నలుడు ద్యూతము రాజ్య ధనాగారమునే యోడెనని తెలియుటచే నామె చింతానిమగ్నచిత్త యయ్యెను. "ఔరా? ఎంతటి సద్ధర్మశీలి? ఎంతటి సత్యవ్రతుఁడు! అట్టి నలసార్వభౌమునకేమి? ద్యూతము నాడ వలయునను బుద్ధియేమి? ప్రజలెల్లరు మొఱబెట్టుకొనినను వారినెల్ల ధిక్కరించుటయేమి? తన ప్రజలను బిడ్డలకంటె నధిక ప్రేమానురాగములతో జూచు మహారాజున కీనాడు ప్రజ లంతఃపురికేల వచ్చిరని ప్రశ్న వేయఁ జిత్తముగలుగుట యొక విపత్సూచకాంశము. ఏదో యాపదరానున్నది గావుననే యింతటి సన్మార్గప్రవృత్తునకు మృగయా ద్యూతములను వ్యసనములలో మనంబు చిక్కువడినది." అని దమయంతి, భీమరాజపుత్త్రి కడుంగడు విచారముచెంది "బిడ్డల నిందే యుంచినచో, యీ విపత్తులు వారిపైకివిసరుకొని వారిప్రాణములకు, సుఖములకు హాని కావచ్చును. కష్టసుఖములకు బాధ్యులమైన పెద్దవారము మేమే విపత్తులువచ్చినను సహింపవచ్చును. కావునఁ బిల్లలను విదర్భదేశమున కంపివేయుట యుచితమని యూహించెను. రాజ్యములోని యుత్తమా లోచనకర్తలను బిలిపించి వారి అభిప్రాయములడుగగా వారును బిల్లలను తాతగారికడకంపి యుక్త పరిపోషణమునొనర్చుట యుచితమని చెప్పిరి. అంత వార్ష్ణేయుడను రథసారథిని తన రథమును గైకొని రమ్మని యాజ్ఞాపించెను. సారథి చింతాక్రాంతహృదయుడై రథమును దోలుకొనివచ్చెను. దమయంతి, తన కుమారుడగు నింద్రసేనుని, దన పుత్త్రికయగు నింద్రసేనను, రథముపై గూర్చుండబెట్టి, రానున్న యాపదలకును,

పుత్రపుత్రికా వియోగభావమునకును గన్నీరుగార్చి వారిని సారధి కప్పజెప్పి, భీమరాజు చేతులకప్పగించునంతవఱకు బిల్లల రక్షణభారము నీయదియని యతనికి హెచ్చరించి, రథమును బయటికి సాగనంపెను. సారథియుఁ దన ప్రభువునకై మూఁగివచ్చుచున్న విపత్తులను జింతాక్రాంతుఁడై, దమయంతీదేవికి మ్రొక్కి" నల్లెయని యుత్తరము సెప్పి, యాజ్ఞ వడసి రథమును విదర్భదేశమునకు బోవుమార్గమును బట్టించెను.

ఆ సమయమువఱకు నలమహారాజు సర్వస్వమును ద్యూతమున నోడెను. పుష్కరుని సాహసకృత్యమునకు వెఱఁచెంది-, సర్వస్వము నాతనికప్పఁజెప్పి, లేనవిధిని దానుదూఱుకొనుచు, వస్త్రాభరణములను ద్యజించి, కట్టుబట్టలో దమయంతినిజేరి, విధివశంబిట్లయ్యెను. మనమింక రాచనగరు వీడిపోవలయును బయలుదేరిరమ్మని పిలచెను. రానున్న విపత్తు నంతకుముందే యూహించి సర్వసిద్ధయైయున్న మహాసాధ్వి, దమయంతి, యేదియెట్లయినను దాను మగనిపదచ్ఛాయలనంటి నడువ వలసినదేయని నిశ్చయించుకొని నలునితో బయలుదేరెను. రాచనగరు వీడి నలదమయంతులు పురవీధుల నడువసాగిరి. పురజనులు మంత్రులు పురోహితులు, సామంతులు ఎల్లరును గన్నీరుగార్చుచుండ, దమయంతీ సమేతుడగు నలుడు నగరివీడి, సమీపముననున్నయొక ప్రాతమందిర మున బిచ్చవానివలె నివసించుచు మూడుదినములు గడపెను.

(18) దమయంతి నలునకు ధైర్యము సెప్పుట.

విచారగ్రస్తుడైయున్న నలునిజూచి దమయంతి, "ప్రాణేశ్వరా! మీకీచింతయేటికి? మీకీయోచనయేల? ఏజీవితోనైనను రథగజతురం గాది సంపదలు వెంబడించివచ్చునవి కావు. మీరుచేసిన దానధర్మములు మీ వెంటవచ్చును. తమ సత్యధర్మములు తమవెంటవచ్చును. ఇప్పుడు గాని, పూర్వ జన్మమునగాని మనము చేయు పాపపుణ్యములు మనవెంట నంటియుండక తప్పవు వృక్షాదులను ఛాయలవలె, మనలను మన మంచి చెడుగులు దగుల్కొనియే వచ్చుచుండును. తమరుద్యూతమాడి పరుల సొమ్ము గైకోవలెనని యభిలషింపలేదు. విజయలక్ష్మి సమార్జనకై జూదమాడలేదు. ఇహాపరసౌఖ్యము లభిలషించి యీ ద్యూతము నారం

భింపలేము. తమకులోఁబడి కప్పములుగట్టి సలాముఁ జేయుచున్న పుష్కరరాజు మీా నేస్తమును వాంఛించుట విని చోదితము. అయ్యెఁబో ద్యూతమాపట కొసఁబడనేల? ప్రస్తే మూడిసిరిరాక అంతమాత్రమున రాజ్య సర్వస్వము పోవనేల? ఇవియెల్ల నీశ్వర సంకల్పములుగాని మనప్రయత్న ఫలితములుగావు. మానవుఁడు సర్వసుఖంబులనుండి తను ప్రయత్నములయందు విజయము చేకూరుచున్నప్పుడు సర్వమును దమ ప్రయోజకత్వమని విఱ్ఱవీఁగుటయు; కష్టములపాలై తమ ప్రయత్నములు అపజయోన్ముఖములగుచు దుస్సహదైన్యము నొందుటయు సహజము. కాని దైవమొక్కరీతి నదృష్టచక్రమును ద్రిప్పుచున్నప్పుడు మానవ మాత్రుడేమిచేయఁగలఁడు? దైవప్రేరితమగు నీ మార్పునకు వెఱచి, చింతానిమగ్నులగుటయు, మతిభ్రమనొందుటయు సముచితముగాదు

ఉ॥ జ్ఞానికిఁ గష్టసౌఖ్యముల నారతమున్ సమవృత్తిఁ దోచు న
జ్ఞానికి సౌఖ్యకాలమునఁ గల్గుఁ బ్రమోదము, కష్టకాలమే
హైన విచారముఁ గలుగుచుండు, నియ్యవి రెండు పూర్వక
ర్మానుసృతంబులై తనరు నదున ధైర్యము నొందఁజెల్లునే.

నలసార్వభౌమా! చరాచర భూయిష్ఠంబగు నీ సమస్తప్రపంచమును సృష్టిసేసి జీవులనొసఁగువాఁడయిన పంకజాసనుఁడు నైతము ఒకప్పుడు శంకరుని చేతిలోఁ జిక్కి శిరము పోఁగొట్టుకొన్నవాఁడు. త్యాగశీలమున నఖండప్రఖ్యాతిగాంచిన బలిచక్రవర్తి విష్ణుపాదాహతుఁడై పాతాళలోకమునఁ బడిపోయినవాఁడు. సర్వజగదుపకారకులైన సూర్యచంద్రులు నయితము ఒకప్పుడు దిశలుతప్పి చరింపవలసివచ్చినది. అనంతైశ్వర్య సంపన్నుండైన దేవేంద్రుఁడొకయప్పుడు దూర్వాసుని కోపాగ్నికాహుతియై యెన్నరానియిక్కట్టుల దవులుకొన్నవాఁడు. ఇట్లుండ సుఖదుఃఖములు, మంచిచెడ్డలు, పుణ్యపాపములు, ధర్మాధర్మములు దేవతలకు గూడ సమానముగ లభించుచున్నయవి. అట్టియెడ మర్త్యులమగు మనకు కేవలము సౌఖ్యములును, పుణ్యఫలములును, ధర్మఫలములను గావలె నన్నచో నెట్లు దొరకఁగలవు? అన్నియుఁ గావటికుండలరీతిగా సమాసమ వ్యాప్తిచే ననుభవించితీరవలయును. సకలధర్మవిజ్ఞాతలైన తమరిట్టి పరి

శాపముచే గుందుట న్యాయముకాదు. ఇప్పటి కర్తవ్యము నాలోచింప వలయును. తమ బుద్ధిప్రకారముగను సాధ్యమగునా వ్యవహారముండ నేరదు. ఈనాడు ప్రాక్తన పాపఫలంబను మేఘంబావరించినమాత్రమునఁ దమ ప్రజ్ఞా సాగరాంతర్గతమగు మహా తేజోదీపిక కేమిలోపము గాగలదు." అని ధైర్యోక్తులాడెను. అంతయెల్ల వినిన నిషధేశ్వరుడు మొగుల వీడిన సూర్యబింబమువలెఁ దెలివినొంది "ప్రాణేశ్వరీ ? మనము రాజనగరమువీడి యిప్పటికి మూడుదినములైనది. ఇంతవఱకు మనకే యాహారమును గన్నులఁబడలేదు. మనదిగులు నెడబాపువారొక్కరును గానరారైరి. ఈనాడొకరమారగించితిరా యను కనుగొనువారలైన లేరుగదా ? ఆహా దినమెంతలోమారినది ? అక్కటా దైవసంకల్పమెట్టి తత్వముగలది ? ఎంతలో నెంతటివైపరీత్యమును గలుగజేసిన యది ?

గీ॥ నింతవింతగ జగము గాన్పింపజేయు
అంతయుఁ విస్మరింపంగ నాచరించు
అంతయుఁ నాయదనిపించు నంతమాపి
వంతలఁగూర్చు నీశతత్వంబయారె.

ఇదియంతయు నా పురాకృత కర్మ ఫలితము. నే నేపుణ్యాత్ములనో యడవులఁడించి యాకలిపాలు సేసితినో గాబోలు. నే నెవ్వరిసంపదనో హరించితినిగాబోలు. నేడు నాకిట్టియాపద వాటిల్లినది. అకటా! యేదైవమునకును నాయందిసుమంత దయపుట్టదాయెగా? నేనంతఃపురమునఁ బుష్కరునితో జూదమాడనారంభించినపుడు, మంత్రి సామంతులును, పురోహితులును ప్రజావళులును, గలసి జూదమాడవలదని హితబోధ సేసిరి వారివచనములు నాచెవులకు ముకులై తోఁచెనుగదా? వారి హితవాక్యముల నే నేల యుల్లంఘించితిని? సుహృద్వాక్యోల్లంఘనమునకు ఫలితముగా నేఁ నాకీయిక్కట్టుగలిగినది. కానిచో నిపురప్రాణములకుఁ బట్టెడన్నమునకుఁ గరువగునా?

గీ॥ ధర్మరతులకు దెల్పితి ధర్మలీల
హితము వాకొచ్చి పౌరుల నేలినాడ

క్షేమమున కుర్వినెల్లఁ బాలించినాఁడ
అడవిచేరితి నకట నేఁడన్ని యుడిగి.

గీ॥ అలరులమ్మినకడఁ బుల్లలమ్మటయ్యె
వ్రాఁకలయడవిని బిల్లులు నిలువగంటి
ఏఱుబాఱెడి తటిగంటి నొండమావు
ఈవిధి విధానమోర్వఁగా నెవరితరము?

హృదయేశ్వరీ! రత్నాలంకృత సువర్ణసౌధమున మహైశ్వర్యము ననుభవించుచుండిన నీవును నాతోడఁగూడి యీ మహా విపినసీమలందిరుగ వలసివచ్చెగా? నాకుఁగలిగిన దుఃఖమును నేనుభరించినను, నిన్నుఁజూడ నాకుదయించు సంతాపమును భరింపజాలకున్నాఁడను. ఇఁక నిచ్చోట నిలచినచోఁ బ్రయోజనములేదు. అరణ్య మధ్యమునకేగి, యందొక పర్ణశాలను నిర్మించుకొని, తపసులవోలెఁ దపంబాచరించుకొనుచుంటి మేని, భగవత్కృపాకటాక్షము మనయందు గలుగకపోదు. భగవదను గ్రహము గలిగిననాడే మనము కృతార్థులమగుదుము. పోవుదము నడువు మని యా కుసుమకోమలిని దోడ్కొని పోవసాగెను. ముందునడ చినకొలంది నలదమయంతుల కిరువురకును, నాకలి, దప్పి యత్యధిక ముగ బాధింపజొచ్చెను. ఘోరారణ్య మధ్యభాగమునకుఁబోయిన యంతట, నలుడు దమయంతినిజూచి "సాధ్వీమణీ? మనము జూచుచున్న యీ కాననము మహా భయంకరమైనది. ఇది నిర్మానుష్యము. ఇందు సింహ శరభ శార్దూలముల సంచారము మెండు. కొన్నితావుల దప్పికి నీరును దొరుకజాలదు. కందమూలములు మాత్రమిందులభించును. వానినేదినవలయును. నీవు ఎండలోనడచునప్పుడు ఇసుక వేడిమికిఁ దాళ జాలవు. వానలకోర్వలేవు. మంచు గురియునపుడు దాని శైత్యమునకు నిలువనేరవు. కావున నా పలుకులనాలకించి, నీమది నెమ్మదిజేసికొని, నీతల్లిగారియింటికేగి నా కష్టసుఖంబులు వారికి దెలుపుము. భగవద్ధ్యా నముసేయుచు నా కష్టములుదొలగి, నాకు శ్రేయస్సు కావలయునని ప్రార్థించుము. పిల్లలను జాగ్రత్తగా జూచుకొనుచుండుము. దైవము నన్ను దిప్పినన్నాళ్లు నేనీయడవులఁద్రిమ్మరి పిదప నీయొద్దకువచ్చెదనని

పలికెను. ఆకఠోరకరసంభాషణము వాలించి దమయంతి కన్నీరుమున్నీరుగా విలపించి "ప్రాణేశ్వరా! నా ప్రాణాధారములగు మీ పాదపద్మంబుల వీడియుండజాలను. తమ దర్శనము సేయక దినము గడుపజాలను. తమరున్న తావే నా సుఖస్థానము. తమరున్నయడవియే నాకు రాజనగరము. తమరున్న వృక్షచ్ఛాయయే నా కంతిపురము.

క॥ పతితోడసుఖము సతులకు
పతియేదైవమ్ము ప్రాణ వల్లభునకు నా
గతియో సద్గతి తమకడ
హితమగుసేవను బాయుటెట్లిపుడు హృదీశా.

చ॥ అమలినసద్గుణాకర, మహామహనీయ మహోవిశాల యో
సముచిత ధర్మమార్గచర సత్యరతా, నలసార్వభౌమ ? దై
వము, పయిదెచ్చిపెట్టిన విపత్సమయంబున నొంటిపిడ ధ
ర్మమ? పతికంటె సాధ్వులకు బ్రాణము లెక్కువ? ప్రాణవల్లభా."

అని శోకించుచు, విడువజాలక పతిసేవ సేయుచు వెంటనడచుచున్న దమయంతి ధర్మోక్తులకు బ్రతివచనంబు సెప్పంజాలక, తన పురాకృతకర్మ విధిందూరుచు దైవంబులబ్రార్థించుచు. తన యవివేకమును దూషించుకొనుచు, భయదమృగారావసంకులంబయిన ఘోరారణ్యంబునం బ్రవేశించి, యెండవేడిమికోర్వజాల నలసార్వభౌముడు విశ్రాంతికై దట్టమగు నొక చెట్టునీడం గూర్చుండెను.

(19) హంసలు వలువలెత్తికొని పోవుట.

మధ్యందిన మార్తాండుండు చండప్రచండుండై మండుచుండెను. నలదమయంతుల కాకలిదప్పులచేఁ గడుపులు మండుచుండెను. ఆ తరుణమునఁ గలిపురుషుడు హంసాకృతులందాల్చి, వారియెదుటవ్రాలి, యపూర్వగమనాదివిలాస ప్రదర్శనంబులచే వారి మనంబులకు నుత్సాహమ్ముప్పతిల్ల జేసెను. హంసలనుగాంచి నలమహారాజు దమయంతినిజూచి, "సతీ ? ఈ విహంగవిలాసముచు జూచితివా ? మన యాకలిదప్పులనడంచి ఇంచుక మనశ్శాంతిగూర్చఁ జేయుటకు సర్వేశ్వరుడీ యంచలనంపినట్లు

తోచుచున్నది. ఇంక మన మూఁకలికాగఁజాలము. ఈ పక్షులంబట్టి యన్నింటోజెల్చి మనక్షుద్బాధ తీర్చికొందము. ఇంతుక తడవున్నై వ్రము, నేనీపక్షులను బట్టికొనియెదను." అని కొడిగొ యాపక్షుల వెంబడించెను. హంసలు నలునిచేఁజిక్కక, యొకప్పుడు పైకెగయుచు, నొకప్పుడు నేలఁజువ్వలెత్తుచు, నొకప్పుడు దరినున్న పొదలలోదాగుచు, బహుతెఱంగుల నాతనిం ద్రిప్పి మఱింత యలయించనందఁజేసెను. అంత నతడు కోపము దెచ్చికొని యెట్లయిన నీనిని బట్టవలయునని నిమిాపించుచుండ నయ్యవి చెట్లపైకెగసి కూర్చుండసాగెను. అప్పుడతడు తన కట్టుపుట్టమును వాటిపై వైచి పట్టుకొనఁ బ్రయత్నించెను. హంసలు తమ పై బడిన వలువ నాకస్మికముగ నల్లియెత్తుకొని యాకసమున కెగసిపోయెను. నలుడు విచారగ్రస్తుడై, ఆహా! యేమివైచిత్రము. దైవమెంతవిరుద్ధముగి నున్నవాడు. పక్షినిబట్టుకొను నుద్యమమునవైన విజయము నొంద నీయుటలేదే? అని తలంచుచు గాలగతికి విస్మయమందుచుండ, నాకసమునుండి మేఘగర్జనమువంటి నాదముతో "రాజేంద్రా! భుజబలసంపత్తియందునను, ధైర్య సాహసములయందును, నైశ్వర్యముయందును, నీ వసమానుడవైయుండి యసదృశరూపసౌందర్యమును గలిగియుంటచే దమయంతి నీ యింతియైనది. మీ దాంపత్యము నెడబాపదలంచి, నిన్నుఁ బుష్కరునిచే జూదమాడునట్లు చేసి నీ సంపద సర్వమును గోల్పోవ జేసి నీ రాజ్యలక్ష్మి నాతనికిప్పించినది నేను. నేడీయరణ్యమునఁ గట్టుపుట్టములేక తిరుగాడ జేసినదియు నేనే. నీ నగరమ్మునను న్నప్పుడు నీవు వస్త్రదానములు సేసితివి. ఆ దేవిధమున మాకును నిప్పుడీవలువను దానము సేసితివనుకొనుము. ఇదిగో నీ వస్త్రమును గైకొనిపోవుచున్నాను" అని పల్కి యా కంఠస్వరమంతరించెను. అంత నా సత్యశీలియగు నలుడు చింతాక్రాంతుడై యిట్లు విచారింపదొడంగెను. "ఆహా! దైవమా? కాలగతి నెంతగా మార్చితివి?

క॥ కలిమి సమస్తము బాసితి
కలరాజ్యము గోలుపోతి, గాలముగతనకా
మొలగల వలువను సైతము
పులుగుల పాలాయె, నడవి. ముందేమగునో?

కం॥ అడవుల నాకలి దప్పుల
కడలుచు నర్ధాంగిఁబోడ నలయిక గలిగెన్
పొడమిన నాఁటి నిజాకృతి,
వడసితి నొక పుట్టగోచి, పాతయె నిలచెన్.

మ॥ అకటా! ద్యూతము నాడఁజేసితివి సత్యాప్త ప్రజాబోధ నిం
చుక యాలింపఁగ నీక; రాజ్యమితర క్షోణీశు జేర్పించి నా
వికఁ నాలిన్ ననుఁగాన నక్షితిఁ ద్రోయింపంగనై నావు; బా
లక భూపాలఁ డటంచు నెంచకిటు జేలన్ జేసి మైఁగట్ట సం
తుక మేనుంచక సిగ్గుదీసితివె? ఓశాలీ కులోద్ధారకా.

ఈ విధమ్మున విలపించుచున్న మనోనాయకునిగాంచి దమయంతి తన పయ్యెదకొంగుతోఁ గన్నీరుదుడిచి, తనదుఃఖంబు నాత్మలోనడంచికొని, "ప్రాణేశ్వరా? పురుషులకిట్టి యధైర్యము చెల్లునా? సకల భూమీశ్వరులను నొక్కుమ్మడినైన జయింపగల మీ శౌర్యమెందుబోయెను? సుఖదుఃఖంబు కాలానుకూలంబుగ మానవుని నావరింపక మానవని యెఱిగియు మీకీచపలత్వమేటికి?" అని ధైర్యోక్తులాడెను.

"హృదయేశ్వరీ! చూచితివా? మనమ్రోలవ్రాలి విలాసగమనంబులు జూపిన యంచలు ఆహారార్హములని వెంబడింప, నవి నాచేతికందక పలు తెఱంగుల నన్నటునిటు త్రిప్పెను. నేను గోపముబూని యధికాయాసముతో బట్టబోవ నవి యందందుడాగి తప్పుకొనిపోవుచు నెగిరి యొక చెట్టుపై వ్రాలెను ఆ చెట్టుపై వ్రాలి నక్కియున్న యంచలపై నా కట్టుపుట్టమును విసరితిని. అవి నా పుట్టము నెత్తికొని పైకెగసి వినువీధినంటి, యేగుచు, "రాజా! పుష్కరునితో నిన్ను జూదమాడఁబ్రవేశపెట్టి యతని పాచికలయందుండి నీవోడునట్లుచేసినది నేన. నీ రాజ్యలక్ష్మి బుష్కరునకు జెందునట్లుచేసినది నేన. నేడు నిన్నీకాననంబునఁ దపింపజేయునది నేన. నీ కట్టుపుట్టమునుగ్రహించి, నిన్నొక గోచిపాతపెట్టుకొని తిరుగాడునట్లుచేసినది నేన." అని పలికి యదృశ్యములయ్యెను. ఈ వృత్తాంతమంతయు విచారింప, "నిది నిన్ను వివాహమాడనెంచి వచ్చిన కలిపురుషుని చర్యయని తోచుచున్నది. అయినను సర్వేశ్వరునకు

మనయెడలఁ గృపయున్నచో నిట్టి కష్టములెన్నివచ్చినను నవి తొలంగి పోక మానవు. పరమేశ్వరుని కృపాకటాక్షముల వలనిల నెట్టి యాపద లైనను బటాపంచలు గాకపోవు." అని. సధైర్యముగ నలుడు సంభాషించెను. ప్రాణనాథుడింతటి ధైర్యమూని సంభాషించినమాత్రమున దమయంతి మఱింత ధైర్యముబూని,

క॥ కలిమికి బుట్టినయిల్లగు
బలశాలి కుబేరుమైత్రి బడసిననారుడుల్
యిలదిరిపమెత్త దిరుగడె
తలపగ విధి దాటనెవరి తరమా! దేవా.

అని ధైర్యముచెప్పెను. మఱియు "అట్టి పరమేశ్వరుఁ డంతవానికే శాశ్వతభిక్షావృత్తి యేర్పడినది. దాని కంటె మనకష్టమధికమైనదా? ఈ విపత్ప్రాప్తి మన ప్రాక్కర్మఫలితమని తలంచి యూరడిల్లవలయును గాని వేఱుగాభావించి గుండెబదులు రాదు. ఇదిగో యీ యగుపడు కాలిబాట నెగుడము రండు. అని నలునిదీసికొని ముందడుగువైచెను."

"ధర్మనందనా వినుచుంటివా? నలదమయంతుల విపత్పరంపరలు. దమయంతి పాతివ్రత్యశుద్ధతను దిలకించితివా? భర్త దిగులుపడి నట్టడవిం గూలబడినంత నాతనికి ధైర్యోత్సాహములుసెప్పి రాచపుట్టి వందిన సుకుమారగాత్రి, యబల, చేయూతయిచ్చి నడపుచున్నది? వారికష్టము లింకను గలవు. చెప్పెదను శ్రద్ధతోనాలకింపుము"ని బృహదశ్వ మహాముని యొకసారి హెచ్చరించి యావలివృత్తాంతము చెప్పదొడంగెను.

"ఇట్లిరువురు మఱికొంతదూరము పోయినపిమ్మట, నొక్క యిసుకయెడారి యగపడెను. చెట్టునీడయు లేకుండెను. ఆకలిబాధ యధికమయ్యెను. దప్పిక్రియు ఎక్కువయ్యెను. దమయంతి మృదుపాదము లాయిసుక వేడిమికాగజాలక యెఱ్ఱవాఱెను. అట్టియెడ పరమేశ్వరుని దలంచుచు" దమయంతి

క॥ జలజాతనేత్ర ? శ్రీహరి
కులదైవమ ? నృహరి ? యఖిల కువలయరక్షా !
తొలికర్మ ఫలితమైనను
తొలగి తుపు కష్టమెల్ల తోడ్పడగదవే ?

మాధవా ? మా ప్రాణములు కాఱడవిలోఁ దపింపఁజేయుచున్నాడవు. మేము నీకేమి యపరాధముసేసితిమి ? నీభక్తుల నెన్నడును బరిహసించలేదు గదా ? సభారంగంబులలో దేవదూషణముసేయలేదు గదా ? నీపేరుబల్కి బిచ్చమెత్తువానినైనను మేమెన్నడును నిరసించి యగౌరవము సేయలేదే ? మిగిలిన ప్రజలవలె మేముమాత్రము నీ సంతానముగామా! ఇంచుకంత దయజూపి మా యుపద్రవములు బాపరాదా ? ఇఁకముందు మేమరుగుటకు దగినమార్గమైన జూపింపరాదా ?" అని మనఃపూర్వకముగా ధ్యానించెను. పదంపడి పదియడుగులుబోయి నలదమయంతులు నలుదెసలు తేటి పారజూడ నాముంగటనొక చతుష్పథస్థానము గనవచ్చెను. ఆతావున నిలువంబడి నలుడు దమయంతింగాంచి; సతీ! తూరుపుగాబోవు నీమార్గము విదర్భదేశమునకు బోవును. దక్షిణముగానేగు నీమార్గము అయోధ్యాపురమునకు బోవును. పశ్చిమముఖముగా గనఁబడునది యిప్పుడు మనము వచ్చినమార్గము. ఉత్తరముగా పోవు నీమార్గము హిమాచలమునకు బోవుది. ఇందేమార్గము నీకు సమ్మతమో తెల్పుము, ఆమార్గము నంటిపోవుద"మని యడిగెను.

(20) విదర్భ దేశమార్గమును దమయంతి గోరుట.

అదివిని దమయంతి, నాథా? మనమింతవఱకు పదియైదుయోజనముల దూరము నడచితిమి. అలసితిమి. ఈ పరిస్థితిని నితర దేశములకు బోవుమార్గమునుబట్టి యగమ్యమగు నరణ్యాంతర్యమున నుందుచుండుట కంటె భీమనృపాని విదర్భదేశమునకుజేర్చు మార్గమునుబట్టి పోయితిమేని, కొంతతడవునకు మనము పరిచితప్రాంతములో బడియెదము.

క॥ తమ యత్తమామలిరువురు
తమ సౌఖ్యవిచారమందు దనరుదురటంచున్

దమరు వనుఁగొని యేగిన
క్రమముగ సకలంబు శుభముఖంబగు జూమీ౹౹

జరిగిన విధా మునకు విచారింపవలదు. మనసుఖముల జెడగొట్ట వలదు. ఈనాటి యాపదలు సుఖములుగామారు కాలము తిరిగి రాగలదు. అంతవఱకు విదర్భదేశమునుండి కాలముగడిపెదము నా జననీ జనకులు, మీ యత్తమామలు మన యరణ్యావాసవార్త విని గడుంగడు బొగులుచుందురు. వారు మనకు వలయుసౌకర్యములుసేసి మనకష్టముల నెడబాపగలరు. మనకు గావలసిన సౌధములొసంగి యందు మనలనుంచి సురక్షితముగ గాపాడగలరు. ఈ విషయమున నాకు సంపూర్ణ విశ్వాసముగలదు. ఏలయన; స్వయంవర సమయమున నింద్రాదులు వచ్చినప్పుడు, నలసార్వభౌముడే నా కుమారికిఁ బతిగావలయునని దదేకదీక్షతో నా తలిదండ్రులు భగవద్ధ్యానము సేయుచుండిరి. మీ యాగమనమింంచుకతడవైన యప్పుడు వారి ముఖారవిందములయందుఁ గళకాంతులే లేకుండెను. కావున వారికి దమయందు గల గౌరవభావము ఎన్నటికిని లేశమైనను దఱుగనేరదు. ఈ రహస్యము నేనెన్నియోమారులు మా తలిదండ్రుల ముఖములనుండి వింటిని. అందువలన నాకును నంతరాత్మలో నమితానందము గలుగుచుండెడిది. తమ రన్యథా విచారింపక విదర్భ రాజ్యమున నుండుటకు మనోనిశ్చయము సేసికొనుడు, విదర్భమార్గము బట్టి నడువుడు," అని కన్నీరొలుక బలికెను. అయ్యెడ నలుడు వ్యాకులిత మనస్కుఁడై భీమరాజతనయఁగాంచి, శిరఃకంపనము సేసి,

ఉ॥ ఎంతటి మాటలాడితివి, యింతిరో ఈనల సార్వభౌము డ
త్యంత పరాక్రమ సమంచిత బాహుబలుండు పు
ష్కరాక్రాంత నిజోత్తమాతలము గాదనివీడి, వనిం బడంగనా
వంత విదర్భరాడ్గృహ నివాసముఁజెందను మేలుగాదొకో॥"

అని పలికి మఱియు;

"వైదర్భీ! ఈ జగమ్మునన ననేకులు పరగతిసమార్జన తత్పరులై, తమ పురంబులను, తమ పురజనులనుఁ డిచి, తమ సిరులైశ్వర్యములను

కొని, బంధు పుత్ర మిత్ర కళత్రాదులనయితము విడనాడి సకలాలంకార వస్త్రములయందును బ్రీతిఁదొఱఁగి, వల్కలాజినములఁదాల్చి జడదారులై మహారణ్య మధ్యప్రదేశములయందుఁజేరి, కందమూలముల నాహారంబుగాఁగొని, తపములాచరించుచున్నారు. అట్టి తపస్సంచరణ లాభమునకై పరమాత్మను మనల నడవులలోనికి నడపించుకొనివచ్చినాఁడు. అట్టి యరణ్యావాసము సేవించుట నా యభిమతముగాదు. దైవోద్దేశ విరుద్ధమనియు నా యాశయము. సర్వరాజ్యమును, సంపదలను, బంధువులను మిత్రులను విడనాడుట యొక కష్టము. అట్టి సెనౌరుల పంచఁజేరి తలదాచుకొనుట యు తకుమించిన మఱియొక కష్టము.

సీ॥ బావమఱఁదులే భాషలాడినగాని
మెలమిమై శిరసా వహింపవలయు
వదినెలు మఱదండ్రు బెదరుసూపినవేళ
నడఁకఁ జూపి మాటాడవలయు
అత్తగారొకయింత యాగ్రహించినవేళ
నెదురాడకనుమతిఁ గొదలవలయు
మామగారేరీతి మందలించినగాని
పెడమాటసెప్పక నడువవలయు.

గీ॥ అపుడు పరివారలహాస్యమాడువేళ
ఎదురుమాటాడకన్ని సహింపవలయు
తలచిచూడుము నామాట తప్పుగాదు
అత్తవారింట వాసమర్హంబుగాదు.

అత్తవారింటి కనాహూయమానముగా బురుషులరుదెంచుటయే తగదు. ఒకవేళ నట్టులేగినను నొకటి రెండుదినములు గడపి తమంతటం దామే యనుమతిగొని బయలుదేరి రావలయును. అంతకుమించి యెంత కాలమున్నను గౌరవము పల్చనగును. నాకు గల మర్యాదలను బోగొట్టుకొనుటకు నాకిచ్ఛలేదు. క్షత్రియ కులోద్భవుండనై, రాజరాజపదవి ననుభవించిన నేను, రథగజతురగపదాతులతోడనే యత్తవారింటికిబోయి వారిచ్చు మర్యాదల నంగీకరింపవలయును. అటుగాక, పాదచారినై కట్టు

పట్టమును సైతము గోలుపోయి, యొక గోచిపాతతో దిరిపమెత్తువాని వలె, నత్తవారింట నడుగుపెట్టితినేని వారికి నాయందుఁ బూర్వగౌరవ ముండునా? ఊరి జనమ్ములెల్లఁ బరిహసింపరా? మంత్రి పురోహితా దులు నగుబాటుసేయరా? ఈతలపు సేయకుము. నీకుఁగన్నతల్లి యిల్లు గుటచేఁ గొంతకాలము తలదాచుకొనుట యంత యవమానకరముగాదు. ఇంద్రసేనయు నింద్రసేనుడును నందున్నవారు కావున వారి పరిపోషణము నకై నీవందుండినచో నయ్యది యంత లోకవిరుద్ధముగాదు. కావున నీవు నీ తల్లిగారియిల్లుసేరి పిల్లలను గాపాడుచుండుము. మన సంతానము మనకు సద్గతులకుగారణము. వారినిగాపాడుట మనకొక విధి. అదియునుం గాక యెప్పటికైనను కాలము మార్పుచెందకమానదు. తిరిగి మన భోగభాగ్యములు చేకూరకమానవు. అట్టితరి మనము సంతానవైభవ సహా లోకనతత్పరులమగుదుము. పరమేశ్వరుడిప్పుడొసంగిన ఈ యిరు వురను గాపాడుకొనకయుండుట యొక యపరాధము. ఈ నాలోపమును నీవు పూరించుము. ఇదియు నొకవిధముగఁ బతిసేవయనియే భావింపుము. వెనుకముందు లాలోచిపక, ధైర్యమవలంబించినీవు పుట్టినయింటికిఁ జేరుమని ప్రోత్సహించెను. ఇటులాడిన నలునిపలుకుల నాలకించి యశ్రు బిందువులు కార్చి, పయింబడవిలపించి, యాతని పదపంకజములకు నమ స్కరించి, వారిపై రెండుచేతులుంచి, హృదయేశ్వరా? నామేనఁ బ్రాణ ములున్నంతకాలము, మిమ్ముబాసి యొక్క లృటికాలమైన సహింప జాలను. నా యీ దేహము ఈ యరణ్యమున గ్రుంగినచో విచారములేదు. నీటిపాలైనచో చింతలేదు. భీకరమృగమ్ముల పాలైనచో దిగులులేదు. ఇందకారణముగ నుత్పత్తియగు అగ్నికాహుతియైనచో బాధలేదు. మీతోడగూడి యరణ్యవాసమునకే నేనిచ్ఛగింతునుగాని, మిమ్ము నెడబాసి. మిమ్ముల మహారణ్యమధ్యమ్మునడించి యే నొకదానను నా తలిదండ్రులయింట సుఖింపబోవజాలను. అదియునుంగాక,

క॥ తానై కోరివరించిన
ప్రాణేశుని పాదభక్తి వడయని సాధ్వుల్
కానరు పరసద్గతులను
నేనిందున నందు జెడుట యేటికినాథా.

ఇట్టి విపత్కాలమున నేను బుట్టినయింటికిఁ జేరి నివసించితినేని, నాసాటియువతులు నన్నుగని "పతిఁవాటిల్లిన కష్టాలను సహింపనేరక యాతని నొంటిగ మహారణ్యసీమలవిడనాడి తల్లి, గారిం జేరినది. ఈ దమయంతి పతివ్రతగాదని యాడిపోసికొందురు పాతివ్రత్యమహిత నాయందు విరాజిల్లుచున్న వన్నెతున్న నా సుఖకాంతికి లోపముగలుగదా? కళాహీనయైయున్న నన్నుజేరి, దాసదాసీజనంబులు తొంటివలె గౌరవింపజాలరుగదా? అన్యరాజస్త్రీలు నన్ను పరిహాసవచనంబుల నవమానించుచుండరా? పతినిగాసి యమయింటగూరుచున్న కూమార్తె యెంత గుణవతియైనను దల్లిదండ్రులు లక్ష్యముతో జూతురా? ఇవి యన్నియు దమకు దెలియనివంశములుగావు, నాకు ప్రీతికరములుగావు. కావున నిమునస్మైనను మిమ్ములను విడనాడియుండను. మీరెచ్చోటికి బోయినను నేనును నచ్చోటికివచ్చెదను. మీరెందు నివాసముసేసినను, నేనును నందే నివసించెదను. మీరేనాకు దైవము మీతోడనుండుటయే నేను నీడనుండట మిమ్మొడబాయజాలను" అని కన్నీరుగార్చి భాషించిన యర్థాంగిని గౌగిలి చుకొని కన్నీరుతుడిచి, నలుడు,

మ॥ పలుదైవంబుల పాదపంకజములన్ ప్రార్థించినన్నున్ సము
జ్జ్వల మోహంబున బెండ్లియాడితివి నీదైనున్న నాప్రీతిని
య్యెల నిస్సామ్య, మనన్యగోచరముని లీ. నీవునా చెంగటన్
నిలువన్ రాజ్యము బాంధవుల్ విడంబోనీ సౌఖ్యమేతోచెడిన్.

సర్వసంపద్వియోగముగల్గినను, నీయట్టి పతివ్రతాశిరోమణి, యగణ్యపుణ్యాంగన నాచెంతనుండు కారణమున నితవలకు నాకెట్టి యిక్కట్టును దుస్సహముగాలేదు. నీవు లేకున్నచో నామానసమెట్లు బాధపడునో చెప్పజాలను. సర్వసంపద్వియోగమువలన గలిగిన దుఃఖము నీసాన్నిధ్యలాభమువలన గలిగిన సుఖభావమున మునింగి నన్నంతగా బాధించలేదు. కాని త్వద్వియోగభావన నాగుండెయ కదటు గలుగజేయుచున్నది. నిన్నెడబాసి నేను జీవింపజాలను. మన వ్రాతఫలంబెటులున్నదో యెవ్వరు కాగలదు. నాతోడ నేరమ్మని ముందంజవైవసాగిరి. అట్టియెడ కఠినాత్ముడగు కలిపురుషుడు, నలదమయంతుల

దాంపత్యదార్ఢ్యమును జూచి, "ఔరా! యెంత విచిత్రము! సార్వభౌముడగు నీనలుని సర్వరాజ్యమును హరించితిని. మంత్రిపురోహితులకితనియందు శత్రుత్వము వహింపజేసితిని. ఎల్లబంధువులు నితని సేవగింపజేసితిని. మిత్రులనెల్లర నెడబాపి, శత్రువులనుగా మార్పుచేసితిని. పురజనులనెల్లరకును వీరలయందభిమానము లేనిచందమున జేసితిని. కాఱడవులకు జేర్చితిని. మొలపైనున్న వలువనుసైతము పులుగులపాలుసేసితిని. ఇంతసేసినను సతీపతుల దాంపత్యానురాగమునకు లోపము గలుగలేదయ్యె. ఇంక వీరుభయులకును నెడబాటు కలుగజేయవలయును." అని వారికి దృశ్యుడై వెంబడించుచుండెను.

నలదమయంతులాఘోరారణ్యమున నొక కొలనుదాపునకు జేరిరి. దమయంతి యతవలకు నసాధారణ పిపాసాపీడితురాలై యున్న కతంబున నా కొలనిలోదిగి నీరుద్రావి దప్పిదీర్చుకొనెను. అంత విశ్రాంతికై తత్తీరమున నించుక తడవు పండుకొంటిలో, గాఢనిద్రయావరించి యామె కనుగవను మూయించెను. ఆయ్యెడ నలమహారాజును దప్పిదీర్చుకొని దమయంతి చెంగట గూర్చుండి, యామె మొగమువంకజూచి "అక్కటా నా ప్రాణసఖ ముఖమెంతచిన్నబోయినది? ఆహా ఇదెక్కడి పురాకృత కర్మఫలము? నా హృదయేశ్వరి శరీరమిసుకపైబడి పొరలుటయా? ఇరుపార్శ్వముల దాసీజనంబులు వీజనోపచారములుసేయుచుండ, హంసతూలికాతల్పమునబండి నిద్రించెడు సుకుమారగాత్రి కటికనేలంబండి యొడలెఱుంగక నిదురింప నాయెనుగదా! అక్కటక్కటా! దైవమా? ఈ మహాదురవస్థను నాకన్నులారజూడ జేయుచుంటివా? నా జీవితముండియు నేమి ప్రయోజనము, నిష్కళంక పతివ్రతాశిరోమణియైన యర్ధాంగిని దగురీతి సుఖపెట్టజాలనివాడనైతినిగదా" అని యశ్రుబిందువులు రాల్చుచు విచారించుచున్న సమయమున గలిపురుషుడతి తీవ్రముగ నలునిపై నావరించుకొని యతనికేమియు దోచనీయని మతిభ్రమ కలుగజేసెను. అంత నతనిమనంబు స్వాధీనముతప్పి పరిపరివిధమ్ముల దిరిగి తుదకీవిధమ్మున నతడు ప్రసంగింపనాగెను. "ఛీ ఛీ, ఈదమయంతిని జూడ మనమ్ము దిగులొందుచున్నది. అధికానురాగము అధికదుఃఖమునకే కారణము. ఇంక నిందుండి కాలము గడుపశక్యముగాదు." ఇట్లు

మఱేమోతలంచి, తటాలున లేచి, దమయంతి కట్టుకొనినచీరలో నాలుగు మూరలనుజించి, దాను ధరించుకొని విడిపోవనుంకించెను. కాని యందుల కతని యంతరాత్మ యంగీకరింపదయ్యె. "పురుషుడనై జన్మించి, పౌరుష శాలియనిపించుకొని, నన్ను నమ్మియున్న ధర్మపత్నిని నట్టడవిలో విడనాడుట యేటిన్యాయము ? ఈవిషయము వినినవారలు నన్ను బరిహ సింపరా? ధర్మపత్ని నిందించును, బంధువులు హేళనసేయుదురు. లోకాప వాదమును భరించినను, నన్ను బ్రాణముగాభావించి నమ్మి నిదురించు చున్న యర్ధాంగిని మోసగించుట యెట్టి పాపకారణము ?" అని పరిపరి విధములఁ జింతించుచు, ముందునకొకయడుగువైచి తిరిగి వెనుకంజ వైచుచు డోలాయమానచేతస్కుడై మఱియు నిట్లనుకొనెను.

మ॥ మునిసందోహము. నిర్జరప్రకరముల్ పుణ్యాంగనల్ భూసురుల్
ఘనబంధూత్కర మాయరుంధతియు సాక్ష్యంబుండనో భామినీ
నినునే బాయనటంచు బల్కితిగటా! నేడేమిగావించెదన్
నినుబాయన్ విధిప్రోత్సహించె జడుడన్ నిర్భాగ్యుడన్ గ్రూరుడన్.

ఈ దుఃఖసాగరమున కంతములేదు. తలంచినకొలందియు దలం పులు మన బును కలంపకమానవు. ఇట్లు చింతించి ప్రయోజనములేదు. విడిచియేగుటయే కర్తవ్యము." అని చింతాసాగర వీచికాడోలాందోళిత చిత్తుండై, కన్నీరుమున్నీరుగాఁ బ్రవహింప నడుగులు తడబడ నల్లనల్ల నడచిపోయెను.

## (20) నలునిచుట్టు నగ్నిజ్వాలలు దవులుకొనుట.

ఈరీతిగ నలుడు దమయంతిని నిద్రాసమయమున సరోవరతీర మున విడనాడి తానొంటరియై యరణ్యమధ్యమున గొంతదూరము సాగిపోవ, నరసి, క్రూరాత్ముడగు కలిపురుషుడు, తానడవిమధ్యంబ్రవే శించి, తన సామర్థ్యముచే నగ్నిదేవునిబిలిపించి, యచ్చోటుననున్న యాకులను దృణంబులను, నెండినవృక్షములను దహింపజేయుమని యానతిచ్చెను. అప్పుడప్పీతిహోత్రుడు, తన సప్తజ్వాలలను నొక్క సారి రేకెత్తించి, యాయడవింగల వృక్షములమీదబడి భగ్గుమన

దహింపజేయఁబూనెను. నలుడు తనముందుమండుచున్న యగ్నిజ్వాలలను సాహసముచే జల్లార్చి, యగ్నికణములకు భీతిల్లక, వానినెల్ల నిరపాయముగ దాటి, దమయంతిపై యగ్నిజ్వాలలు మూఁగునేమోయని భీతిలి, వెనుకకుమఱలి, యామె నిద్రించినకొలనుదరికి రాఁబయలుదేరెను.

## (22) కర్కోటకుడను పామును నలుడు రక్షించుట.

ఆ యగ్నికణములమధ్యఁ జిక్కుబడిన కర్కోటకుడను నొక సర్పము, మేనుగాల దపతపలాడుచు, నిటునటుదిరుగలేక యల్లాడుచు, బుస్సుబుస్సుమని సీరులాడుచు, దనప్రాణములను గాపాడువారెవ్వరును లేరాయని వాపోవుచు, నలుదెసలఁజూచుచు భగవద్ధ్యానముసేయ మొదలిడెను. నలుండగ్నికణములబారినుండి తప్పించుకొని తనభార్యయుండు ప్రదేశమునకు బోవుమార్గమునుబట్టి యరుదెంచుచుండెను. అయ్యెడఁ గర్కోటకుడను నొక్క మహాసర్పము నల సార్వభౌమునిగాంచి; "ఓ రాజాధిరాజా; యుత్తమపురుషా ? పుణ్యశీలా ? పరోపకారమునకుఁ బాల్పడుము. ఈ యగ్నిజ్వాలల వేడిమికి నేను సహింపజాలకున్నాను. నన్నాదరింపుము. ప్రాణదానముసేయుము"ని పలువిధమ్ముల దీనాలాపమ్ములఁ బ్రార్థించెను. ఆ సర్పము నార్తనాదమువిని, యొకప్రాణి యిట్లు దహించిపోవుచున్నదిగదా యని జాలినొంది, దీని నేవిధముననైన గాపాడవలయునని నిశ్చయించుకొని, యా యగ్నిలోనికిం జొచ్చి, యా యాశీవిషము తోకనుబట్టి వెలుపలికిలాగి చితినిదాటించి రక్షించెను. కర్కోటకుడు తన ప్రాణరక్షణముగావించి నాకునపకారము చేయవలయునను తలంపున దూరమాలోచించి యాతని కాలిప్రేలును దాకెను. వెంటనే తత్స్పర్శాకారణమున నలునిమేనెల్ల నల్లబారెను నలుడప్పుడు తనమేనెల్ల నల్లవురంగును దాల్చియుండుట జూచుకొని "నాగేంద్రా ? నేను భార్యతోగూడి యడవులంజేరి, కట్టుపుట్టముసైతము పక్షులవలన గోల్పోయి, నిదురించిన భార్యను విడనాడి, యీయగ్ని ప్రమాదమున కామె యేమయ్యెనో యని చూడబోవు సమయమున నీయార్తావస్థజూచి నీ యార్తనాదమువిని, నీకుపకారము సేయుట శ్రేయస్కరమని భావించి నీ ప్రాణముగాపాడ నన్ను వికృతరూపునిగా జేసితివిగదా! ఇదియెల్ల

నా పురాకృతకర్మఫలము గావచ్చును. ఉపకారమునకుఁబోయి యుప కారముచెచ్చుకొంటిని గదాయని పరితపించెను. కర్కోటకుడప్పుడు నలసార్వభౌముని జూచి; "రాజేంద్రా! చింతింపకుము. నేను నీకీరూప మున ఛాయాభేదముగలుగుట యుపకారముగాదు. నీవు సత్యసంధుడవు, నీవు పరోపకారివి. నీ ధర్మనియమమునుగ్రహించి, నీకుపకారముచేయ వలయుననియే నేను నిన్నుముట్టి నీకీనల్లదనము నొసంగితిని. ప్రస్తుతము నీ విఁకమలగుడుచుచు నొరులయొద్ద సంచరించనున్నావు. అప్పుడు నిన్నొ రులుచూచి పరిహసించుదురు. నీయాకృతి యంత సుందరముగానున్నచో నిన్నెవ్వరును సేవకై యుంచుకొన నంగీకరింపరు. కలిపురుషుడు నిన్ను బట్టి బాధించుచున్నాడు. అతనిప్రతాపము పెద్దకాలము సాగనేరదు, కాలపరిణామమై యతడు నిన్ను విడుచువరకు నీవీయాకృతిలో నుంటివేని నీకుఁ బెక్కువిధముల నుపకారముగాగలదు నీవు కష్టములనుండి గట్టెక్కి నీ స్వరూపము నీకుగావలెనని తలంచినప్పుడు నన్నొక్కమాటు స్మరింపుము ఈ రూపుమాపి నిన్ను సర్వలక్షణ సంపన్నునిజేసెదను. నిన్నుదాకి యిట్లొనర్చినందులకు నాయందు దోసమునెన్నకుము. ఈచర్య యుపకారమని నీకు త్వరలోఁ దేటపడగలదు నాయందు దయ యుంచుము." అని సంభాషించి నిజనివాసమున కరిగెను.

నలమహారాజు తన యర్ధాంగియగు దమయంతి నిద్రించినచోటి తేకేరఁ బ్రియత్నించుచుండఁ గలిపురుషుడాతని చిత్తమును జెడగొట్టి, భార్యపై తలంపురానీయక యుండునట్లుచేసి, తన మాయవలన నాతని మార్గమ్మునదప్పించి, మఱొకమార్గమున నడపించెను. నలుడు కర్కోట కుఁడు తనకుఁజేసిన యుపకారమునకు సంతసించుచు, నిర్భయముగ నడ చుచు, మహామునుల యాశ్రమములజూచుచు, సమీపగ్రామములయందు పౌరులకడ భిక్షాటనముసేసి యాకలిబాధ నడంచికొనుచు, జన సమూ హములు తననుజూచునప్పుడించుక సిగ్గుపడుచు, యశః ప్రతాపముల చేతను, సౌందర్య సంపత్తిచేతను, నైశ్వర్యముచేతను నసమానుడై వెలుగొందిన సకాలము నాత్మగతముచేసికొని యల్లనల్ల నయోధ్యాపుర మునకు జేరెను.

(22) నలుడు ఋతుపర్ణునియొద్ద సారథిగా జేరుట.

ఆసమయమున నయోధ్యాపురమునకు ప్రభువైయున్న ఋతుపర్ణ మహారాజు భగవద్ధ్యానపరాయణుడై యరుణోదయకాలమగువఱకు పన్నీటజలకమాడి శుచియై, పీతాంబరధారియై, సౌధోపరిప్రాంతమున, నిటునటు నడయాడుచుండెను. సూర్యోదయసమయమునకే యందు జేరిన నలుండు, ఋతుపర్ణ నృపాలునిజూచి సవినయముగ నమస్కరించెను. ఋతుపర్ణుండాతనిజూచి, మేడదిగి క్రిందికివచ్చి, నీవెవ్వడవు. ఏల నమస్కరించుచున్నావనియడిగెను" నల్లనిచాయలచే గడుంగడు వికృతాకారమున బడియున్న నలుడు. అయోధ్యాధీశునిజూచి "మహారాజా నేను నిషధపురంబును బాలించుచుండిన నలమహారాజు సారధిని. నలమహారాజు పుష్కరునితో జూదమాడి, తన రాజ్యమునోడి, రథగజతురంగాది సర్వసంపదను నతనికప్పగించి యరణ్యవాసము సేయబోయెను. ఆ పుష్కరుని యొద్దం గొలువుండుటకు నాకుసమ్మతిలేక, తమప్రదేశమునకు జేరితిని. తమరికొలువుసేయుటకు నాకుహితమ్మని భావించితిని. నేను రథసారధ్యముసేయగలను. పాకశాస్త్రమును బాగుగానేర్చినవాడను. పలువిధములగు పక్వాన్నములు భక్ష్యాదులు రుచికరముగాసేయగలను. షడ్రసమ్ముల గుణమ్ములెరిసి పదార్థానుకూలముగ వినియోగింపజేయగలవాడను. నా యందనుగ్రహముంచి నన్ను దమయొద్ద నుంచుకొనవలయునని దయాళురగు మిమ్ము నర్థించుచున్నవాడనని విన్నవించెను. ఋతుపర్ణుడు కొండొకతడవు ఆలోచించి, ముఖమువంకం దేఱిపాఱంజూచి, మందహాసముసేసి, యట్లొకావించుచు, యొద్దనుండుమని పాకశాలకుబంపెను.

నలమహారాజు స్నేహితుండగు భామ్యుడు నిషధపురమునుండి యింద్రసేనను నింద్రసేనుని విదర్భదేశమునకు దోడ్కొనిపోయి భీమనరపాలునకప్పగించి, "దౌహిత్రీ దౌహిత్రులను దయతో గాపాడుచుండుమ"ని చెప్పి యప్పగించి, ఆనిషధపురకుశేమముల నాతనికెఱింగించి, యచ్చటినుండి నిషధపురంబుజేరి, పుష్కరుని రాజ్యపాలనమునుజూచి సహింపనేరక, నలమహారాజు జాడకై పలుతావుల గ్రుమ్మరుచుండెను. తుట్టతుదకతండయోధ్యాపురమును జేరెను. ఋతుపర్ణునియొద్ద క్రొత్తగాం

గొలువునకు గుదిరిన వికృతాకారుని యాజానుబాహుత్వాదిలక్షణము లను, సామాన్యమానవులకుమించిన యౌదార్యాదిశీలమును, నితర ప్రవర్తనమునుబరికించి యితఁడేనలుఁడని నిశ్చయించుకొని తానును నా ఋతుపర్ణునియొద్దనే కొలువుండెను.

(24) నిద్రమేల్కొనిన దమయంతి విలాపము.

అరణ్యమధ్యమున సరస్తీరమునఁ బండినదమయంతి నిద్ర మేల్కొని, కన్నులు తెఱచి చూచినంతఁ దనచెంత నలమహారాజు లేడాయెను నలుదిక్కులఁ దేఱిచూచి నలుడెందునుగానరామి, నివ్వెర పోయెను. శిలావిగ్రహమువలె గొంతతడవు నిశ్చేష్టురాలై, భరింపరాని దుఃఖమున, హా నాథా! నలసార్వభౌమా! యని పలుమాఱులు బిగ్గరగా నఱచి, చుట్టుప్రక్కల దిగిరిచూచి యెందునుంగానక తననందు విడిచి పోయెనని నిర్ధారణ సేసికొనెను.

"సీ॥ నా ప్రాణవల్లభా? నా పాలిదైవమా?
నను వీడి యెందేగినావు నీవు
నానోము ఫలితమా? నాభాగ్యదేవతా!
నను బాసి యెందేగినావు నీవు
నా పెన్నిధానమా! నాదయావారాశి
ననుఁ ద్రోసి యెందేగినావు నీవు
నాదు పుణ్యఫలంబ, నా సౌఖ్యనిలయమా
ననుడించి యెందేగినావు నీవు.

గీ॥ తెలివిమాలి వనంబునఁ గొలకుకెలన
జెలగినిద్రింప దప్పుగా దలచినావొ;
యేమి యపరాధమయ్యెనో యేనెఱుంగ
నెందుబోయితొ యేమైతొ యేమొనాథ.

సీ॥ నీతోడునీడల న్విడువ నెన్నటికంచు
చేయుబాసలె విశ్వసించియుంటి
నీతోడిభోగమే నిఖిల భాగ్యంబంచు
చేయుబాసలె విశ్వసించియుంటి
నినుబాసి నిముసంబు నిలువజాలనటంచు
చేయుబాసలె విశ్వసించియుంటి
నాయైదు ప్రాణముల్ నాతినీవేయంచు
చేయుబాసలె విశ్వసించియుంటి.

గీ॥ అకట నాయందుగోనిన నత్యానురక్తి
నెట్టి దుర్విధిబాపెనో యేమిగతియొ
ఇంతి నిట్టి మహాటవి నిందుబోదు
ఈ వియోగార్తివార్ధిఁ దరించు టెట్లు?

ధార్మికసార్వభౌమా? నలమహారాజా? సకలధర్మశాస్త్రములు పఠించి, సర్వజనంబులకు జీవనోపాయంబులఁ జెప్పి, పరోపకారివని ప్రఖ్యాతిగాంచి, యరుంధతి సాక్ష్యముగబాసచేసి కైకొన్న యర్ధాంగి నొంటిగవీడి యేగుట న్యాయమా? మిమ్మొక్కరినే దైవముగా భావించి నమ్మికొనియుంటిని గదా? ఈ మహారణ్యమున డవి నమృగములబారికి నన్నువీడి యేగగలిగినంతటి యపరాధము నేనేమియొనర్చితిని. ఇఁక నేను బ్రతికి యేమిప్రయోజనము? నన్నీయడవులయందాదరించువారెవరున్నారు. ఈ క్రూరమృగమ్ముల వాతఁబడకుండఁ దప్పించుకొని, యేమార్గమునంటి యేయూరఁజేరుదును? పతినెడబాసి యొంటిపైనె యేయూరికేగినను నచ్చటివారు పరిహాసింతురుగదా? ఒంటిపాటున వచ్చినకారణమున నన్నొక చెడుకాంతగాదలంతురేమోగదా? దైవమా! నాకెట్టిగతి తెచ్చిపెట్టితివి? ఒకవేళ సజీవనై నాతల్లిగారియిల్లు చేరినచో నచ్చటివారు "నీపతి యేమాయెనని నన్నడిగినచో నేనేమని ప్రత్యుత్తరమియ్యవలయును? నా పిల్లల నేమొగంబునజూతును? వారు మాతండ్రి యెక్కడనని యడిగినచో నేనేమని ప్రత్యుత్తరంబొసంగవలయును? చిన్ననాటనుండియు నన్ను బెంచిపెద్దజేసిన దాదుల

నా క్షేమము నడిగినచో నేనేమనిచెప్పి వారికి సంతుష్టిగలుగజేయుదును? ఓ వైకుంఠవాసా శ్రీహరీ? ఓ కైలాసవాసా, శంకరా? నాపై మీకేల దయరాదు?

మ॥ కరిరాజు గ్రజలేచరోద్ధతికి నా, గన్ లేక, నిన్ బిల్వగా
నరుగన్ లేదె, హిరణ్యకశ్యపుని కార్యంబోర్వగాలేక యే
పఱి ప్రహ్లాదుడు వేడనోయనవె, నీ యంఘ్రిద్వయీసేవ నా
పరనన్నేలగ నేటికాలసము దేవా? బ్రోవవా? మాధవా.

మ॥ కరుణాసాగర! శంకరా? దుదవివేకవ్యాప్తినే దుష్కృతుల్
జరుపన్ గల్గితినో యెఱుంగనుజుమీ చంచన్మహైశ్వర్యముల్
తఱిగెన్, రాజ్యమువోయెఁ గట్టకడకున్ బ్రాణేశుడున్ గాననాం
తరసీమన్ విడిపోయె! దిక్కెవరు? దీనన్ నన్ను గాపాడవే.

ఈ విధంబునఁ బలుతెఱంగుల భగవద్ధ్యానము సేయుచు, నొంటి యడుగు మార్గమునుబట్టి, నల్లనల్లన ముందుకుసాగుచుచు, బతిజాడ దొరకునేమోయని పొదరిండ్లను, దరుమూలములను, వెదకుచు బ్రయాణముసేయు సమయమున, నాయాతావులంగల మృగమ్ములును విహంగములును దమతమ యాహారములను విడచి మోరలెత్తి దమయంతి ముఖారవిందము నారయుచు నామె శోకమయస్వరంబుల వినుచుండెను. అంతలో నొక పొదరింటనున్న సర్పము కలిపురుషుని ప్రేరేపణచే త్రోవలోనికివచ్చి దమయంతికాళ్లకు జుట్టుకొని భయభ్రాంతులుచెంది దిగులుపడి చేయునదేమియులేక "హా! జగద్రక్షకా!

చ॥ నరపతి నామనోహరుడు నన్నెడబాయగనేల, గానలన్
దిరుగుటిదేల నొంటిగయి, తెన్నునఁ బాదయుగంబునందు నీ
యురగము జుట్టనేల, యెటులోర్చెద నీకడగండ్ల, నేను శ్రీ
హరి కరుణాలవాల శరణాగతరక్షక, నన్ను బ్రోవవే.

అక్కటా! కాళ్లఁబడినసర్పము కదలకమానదు. మరణము మీాపించినది. నా ప్రాణేశ్వరుని యనుజ్ఞయైన నొందకపోయితిగదా?

సర్వేశ్వరా? మహాదేవా? జగదేకరక్షకా? ఈదీనురాలి ప్రాణములఁ గాపాడుము అని అరచుచున్న తరుణమ్మున, నొకవేటకాడు, విల్లు నంబుల గైకొనివచ్చెను. ఎఱ్ఱనికన్నులును, పొడవైనకోరలును, నల్లని మైచాయయు, వులిచర్మమును, నొకచేకత్తియుఁగలిగి, యతడు, తృటి మాత్రకాలమున నా సర్పమును దుత్తునియలుసేసెను. అయ్యెడ దమయంతి చేతులుజోడించి, అన్నా సోదరునివలె నా యాపత్తున కడ్డము వచ్చి నన్నురక్షించితివి. నామొఱయాలకించి నాప్రాణములు గాపాడితివి, నీకును నీబంధువులకును బుత్రులకును మేలుగలిగి దీర్ఘాయువగును గాక." అని హితవచనములుసెప్పెను. అంత నా వేటకాడు దమయంతిని జూచి "కోమలాంగీ? నీవెవ్వరవు? నీయూరెయ్యది? నీపేరేమి? నీవిచ్చటి కెందును డివచ్చితివి? నీవృత్తాంతము సెప్పు"మనెను "అన్నా? నేను విదర్భదేశాధీశుడగు భీమరాజు కుమార్తెను నన్ను దమయంతియం దురు. నిషధరాజ్యమునకధిపతియైన నలమహారాజు నాభర్త. అతడు పుష్కరునితోజూదమాడి సర్వస్వమును గోల్పోయి, నన్నువెంటగొని యరణ్యవాసము సేయవచ్చెను. నేనాయాసముచే నా కాలనునొద్దున నిదురించువేళ నన్నువిడనాడి యెచ్చటికో కోంబోయెను. ఇది నా వృత్తాంతమని భీమరాజపుత్రి ప్రత్యుత్తరముసెప్పెను. వేటకాఁడామెవంగ నెగదిగజూచి, యామె యందచందములకు భ్రమసి, "ఈయింతి యొంటరిపాటునవచ్చినది. ఈమెకెవ్వరును సహాయముసేయు వారులేరు. ఈ యందగత్తియను నా కుటీరముననుంచుకొనినచో నాగుడి సెకును నాకును గళాకాంతులువచ్చును." అని భావించి, "ఓ, లతాంగీ! నీయట్టి సుకుమారగాత్రిని, వివాహమాడి, నీయందు సుంతయైనను దయ లేక, యీ కీకారణ్యమున నొంటరిగా విడిచిపోయినవానియందు, నీవింత యనురాగోక్తుల బలికెదవేల? అట్టి కఠినాత్మునియందు మనస్సుంచు కొనుట పొరపాటు. నిష్ప్రయోజనము. ఈ యరణ్యమంతయు స్వాధీన పఱచుకొని యున్నవాడను. పెక్కుమంది సుందరాంగులు, నా యందచం దములుచూచి వ్యామోహముగొని, యిందే నిలుచుచుందురు. వారం దరికన్న నీవెక్కువదానవు కావు. నీవు స్వయముగా నీవనమ్మునకు వచ్చి తివి. నీయందు నాకు గోరికపుట్టినది. నీవిందులకు సమ్మతించి నాకుటీర

మున నుంతము నీకేలోపమునుగలుగకుండ గాపాడి, పోషించెదను. నీవు నన్ను సుఖమ్ములదేల్పుము" అని మక్కువమీఱఁ బ్రసంగించెను.

ఆయ్యెడ నాదమయంతి, యా వేటగానివరసి "అన్నా! యిదెక్కడి యన్యాయము? నేను రాజస్త్రీని. ప్రపంచమున రాజులు ప్రజలకు పితృప్రాయులు. ఆ విధమున రాజస్త్రీలు వారికి దల్లులు. అట్టి న్యాయమునకు గేవలము విరుద్ధముగాఁ బ్రసంగించుచున్నావు. ఈ భావమును దొలఁగి, నన్ను నీతోఁ బుట్టువుగానరయుము." అని హితబోధ సేసెను. ఆమె పలుకులువిని యా వేటగాడు "అధికతర కామాతురుడై, ఓ యువతీ రత్నమా? నీవేమేమో క్రొత్తగానివిషయములు చెప్పుచున్నావు. నీపై నాకు జనించిన మోహము అడంపరానిదిగానున్నది. నీవు నా కోర్కెను విచారించి నన్ను రక్షించవలయును. అట్లొనర్చితివేని నీకుఁజాలభాగ్యము గల్గును. ఇది మంచిసమయము నీవు నా పర్ణశాలకువచ్చితివేని నాభార్య నీకు సర్వోపచారములుసేయును. నేను నిశివేళ శ్రీమంతులయిండ్లకుఁ గన్నములువేసి యార్జించిన ద్రవ్యము అనంతముగానున్నది ఆద్రవ్యమంతయు నీయిష్టానుసారము వాడుకొనవచ్చును. ఇంతకంటె నధిక ద్రవ్యము గైకొనివచ్చి నీ పాదములకడనుంచెను. నిన్నీ వనరాజ్యమునకు బట్టపురాణినిజేసెదను. ఇవియన్నియుఁ జక్కఁగా యోజించుకొనుము. నా వెంటరమ్ము." ఆ కఠినాత్మునియందాశవదలుము. బయలుదేరుమని బలాత్కరింపజేయ నుంకించెను. ఆజగన్మాత యంత ప్రచండకోపావేశము గల్గి, కన్నులవెంట బటబటనీరుగార, విలాపస్వరముతో "ఓరీ! పాపీ! నేనింతవఱకు నిన్ను నాతోడబుట్టిన వానినిగాభావించి పలుకుచుంటిని. నీవు నా హితవచనములాలింపక, నాపై దుర్భావముతో నాకరముబట్ట నుంకించితివి. "కావునమున్ను మహేశ్వరుడు తపస్సుచేయుచున్న సమయమున, మన్మథుడు తనచెఱకు విల్లుమెక్కుబెట్టి పుష్పబాణములను విసర, నాశంకరుఁడుగ్రుడై కన్నుదెఱచి చూచుమాత్రమున నతడు భస్మమైపోయెను. ఆదేవిధమునఁ బతివ్రతనగునన్ను బలాత్కరింప వచ్చితివి గావున నీవును భస్మమైపోయెదవుగాక. యని శపించెను. కలి పురుషకల్పితుడగు నా వేటకాడు యాపె శపించినమాత్రమున భగ్గున మండి బూదిరాశియయ్యెను. అంతట దమయంతి వానివిడిపించుకొని

ముందుకుబోవ, దమయంతిచర్యకు మిగులఁ గోపమునొంది, నిజమాయా కల్పితుఁడగు వేటకాఁడు భస్మీభూతుడయ్యెగా నని రోషముదెచ్చికొని, యా పరిసరప్రాంతముల నున్న వన్యమృగముల నామెపైకిఁ బురికొల్ప సాగెను. దమయంతి యా మృగంబుల ఘోరగర్జనములకును దర్జనభర్జనములకును వెఱువక, మృతివచ్చినను రానీ యని తెంపుసేసి, తానును మృగములకంటె నుచ్చైస్స్వరముతో గర్జింపదొడంగెను. ఆ మహాసాధ్వి కంఠస్వరమ్మునకు మృగరాజియెల్ల భీతినొంది వెనువెనుకకు బారిపోయెను. ఈ దమయంతీ ప్రభావముజూచి, కలిపురుషుడత్యగ్రకోపావిష్టుడయ్యెను. దమయంతి నంత నేవిధముననైనఁ దపింపజేయవలయునని నిశ్చయించి యగ్నిదేవునిబిలిచి సప్తజ్వాలలచే దమయంతిమ్రోలఁ బ్రకోపింపఁజేసి భయపెట్టుమని యాదేశించెను. అగ్నిదేవుడా కలి మహాత్ముని యానతికిలోనై యయ్యరణ్యమున నతి భీకరాకృతివహించి దమయంతి యెదుటకు రాజొచ్చెను. అయ్యెడ దమయంతి తనపైవచ్చుచున్న పెనుమంటల నవలోకించి "దేవురా! నాకు వచ్చినయాపదలకంటె నిది యెక్కువైనదికాదు. మానవతులకు బ్రాణముకంటె మానమే విలువగలది. నా ప్రాణనాయకుఁడు నన్ను విడిచిపోయినప్పుడే నేను దేహత్యాగము చేయవలసియుంటిని. దైవ సంకల్పమున నట్లుసేయ యీ యరణ్యమున నల్లాడుచుంటిని. ఇట్లు ప్రాణత్యాగమునకు సాహసింపమిచే నీయిడుమలెల్లఁ బైవచ్చుచున్నయవి. ఇంకను నాలసించినచో నా ప్రవర్తనమునకును యశస్సునకును నైల్యము గలుగగలదు. దైవ సంకల్పమున నిప్పుడు సిద్ధముగాఁ బైవచ్చుచున్న యగ్నిజ్వాలలలోఁబడి, ప్రాణత్యాగముసేయుట శ్రేయస్కరము అని నిశ్చయించుకొని పైవచ్చు మంటలోఁ దనకుదానే యుఱికెను.

ఈ సాహసచర్యనుజూచి కలిపురుషుడు భయవిస్మయములఁ బెనగొన, నాహా! యని బిగ్గరగానఱచుచు, "అగ్నిదేవా శాంతించుము. శాంతించుము. చల్లపడుమ"ని పల్కెను. ఆ పలుకులువిని, యగ్ని దేవుడు శాంతిపడెను. పన్నీటివలెఁ జల్లపడెను. దమయంతిమేను యిసుమంతయుగందక, పన్నీటియందు జలకమాడినయట్లు చల్లనై సుఖముగదోప, నా సాధ్వి యాపలికివచ్చినిలచి, "అయ్యో! నేనగ్నిలోనుఱికినను

మృత్యువు నన్నావరించదాయెనే! అయ్యో దైవమా? ఇట్లుసేయ ధర్మమా? ఇంకను నన్నెన్నోవిధముల హింసింప నెంచితివా? అని చింతించి ఆ పరిసరప్రాంతములందిరిగి, వనమూలికలను, విషపుదుంపలనుండి యెట్టులేని దేహత్యాగముసేయవలయునని యత్నించెను. కాని యప్పుడామెకు నాకలిదప్పులడంగెను. ఏ పదార్థమునుదినినను నది యమృతాహారమై యామె యారోగ్యమును జెంపొందించెనుగాని యించుకంతయు నపాయముసేయలేదు. దమయంతీదేవి కంతకంతకు ధైర్యమధికమయ్యెను. గమనశ్రమయేనిలేక కొంత దవ్వువటకు నరణ్యమునుదాటి మనుష్య సంచారము గల తావునకుజేరెను. ఆ ప్రాంతమున నొక యాశ్రమ ముండెను. అందుఁ గొందఱు మహర్షులు వేదములజదువుచుఁ బంచాగ్ని మధ్యముననిలచి జపతపములుసలుపుచుఁ భగవత్ప్రార్థనములు సేయు చుండిరి.

ఆ పరమసాధ్వి వారిచెంతకేగి సాగిలబడి మొ్రక్కి "ఓ మహనీయులారా?

గీ॥ నిషధరాజ్యంబు నేలిన నృపవరుండు
నలమహారాజు నామనోనాయకుండు
కాననంబుల గాలంబు గడుపవచ్చె
కనఁబడెనె మీకు? తెల్పుడీ గణ్యులార."

అని ప్రార్థించెను. కొందఱు మునికుమారులు "అమ్మా మీదే దేశము. నీవిటులొంటరిగ ఘోరమృగారావసకులమగు నీ మహారణ్యమున నేల దిరుగుచుంటివి" అని యడిగిన నా దమయంతి,

"గీ॥ భుగి, విదర్భమునేలించు భూవిభుండు
భీమ నరపాలవరు కన్న బిడ్డనేను
నిషధపతి నలభూపాలు నెలతనైతి
భర్త గనరామి వెదకుచు వచ్చుచుంటి."

కావున నానాథుడెందైన నగపడినచో వారిజాడ చెప్పుడు. నన్ను కృతార్థురాలను జేయుడనియు జెప్పెను.

## (24) దమయంతికి మునులు దారిచూపుట.

నా భర్తయగు నలమహారాజు పుష్కరునితోజూదమాడి రాజ్య సంపదనోడి, నన్గొని యడవులనివసింపవచ్చెను. నేను ఒకకొలంకు కెలంకున నిదురించువేళ, నన్ను విడిచి యెంకోపోయెను. మహానీయులగు మీదర్శనము నాకు శ్రేయస్కరమగునని విశ్వసించుచున్నదానను. నాభర్త యున్నతావునెఱింగించి పున్నెముగట్టుకొనుడు అని పొరింబోరి ప్రార్థింప నామహర్షులు దివ్యదృష్టిచేజూచి జరిగిన వృత్తాంతమునంతయు దెలిసికొనిరి. మఱియు భీమరాజపుత్త్రి దమయంతీ! భయపడకుము. విచారము మానుము. ధైర్యమవలంబింపుము. నీభర్త నీకులభింపగలడు. నీవనంబునకు వచ్చుటవలన నీకు శ్రేయస్సుకాగలదు. నీ యాపదలన్నియు దొలగిపోయినవి. నీ భర్తయొక్క కృపానిపాచజేరి సుఖమ్మగ నున్న వాడు. ఇకను మూడునవత్సరములకాలము ధైర్యముతో గడపితి వేని, నీ మనోవల్లభుడు నిన్నుగూడును. మీరాజ్యాదులెల్లయుదిరిగి మీకు స్వాధీనమగును. తొలుతటికంటె, యెక్కువ వైభవమునుండి నీవు చిరకాలసౌఖ్యము ననుభవింపగలవు. మాతపమ్ములు పూర్తి యైనవి. మేమింకను మాయావాసములకు బోవనున్నారము. నీవీ మహా రణ్యమున నొంటరిగా సంచరింపడగదు. ఈ సమీపమున సుబాహు మహారాజుగారి పట్టణముగలదు. అచ్చోటికేగి యావలి విచారము సేయుము." అని తెల్పి, కొందఱు మునికుమారులామెను సుబాహుని పట్టణమునకు బోవుమార్గమునం గొంతదవ్వునకు దీసికొనిపోయి దారి చూపి విడిచిరి

దమయంతి యా మార్గమునం గొంతదూరమునకుం బోయిన పిమ్మట, గొందఱువర్తకులు ఎద్దులపై మూటలనిడుకొని, పోవుచు నామె కగపడిరి. ఒంటిగా బయనము సేయుచున్న దమయంతీ మహాసాధ్వీం గాంచి యావర్తకులు "ఓహో! ఈ యువతి ఎవ్వరు? ఈమె చక్కదన మేమి? ఈమె యీ వనదేవతయో లేక మఱొక దేవలోక కన్యకయో గావలయును. అట్లయినచో నీమె మేన నొక్క యాభరణమైన నుండదా!" అని వితర్కించుకొనుచు, నామె సమీపమునకువచ్చిరి. సుకుమారగాత్రియగు నా నలరాజపత్నిని గన్నులారం జూచినతోడనే

వారిచిత్తంబులఁ జిత్తజుడుదయించెను. "ఓ యువతీ! నీవెవ్వరవు? ఇట్లొంటిగ నరణ్యమున నడయాడుటకుఁ గారణంబేమని యడుగగా దమయంతి తన వృత్తాంతమునంతయు వివరించెను. మఱియు "అన్నలారా! ఒంటరినై ప్రయాణముచేయుచున్న నాకు మీరు తోడబుట్టినవారివలె గనబడినందున నాకెంతయు సంతోషమైనది. ఈ త్రోవనే యరుగుచో నగరప్రాంతమునకు పోగలుగుదునాయని ప్రశ్నించెను. మహా పతివ్రతా శిరోమణి దమయంతి, తన వృత్తాంతమునంతయు దెలుపఁగా "ఓహో యీమె నిస్సహాయురాలు. ఈమెతో నేతత్సంగము సేసినను భయము లేదని తలంచి యావర్తకులామెం జేరి. "యువతీరత్నమా! నిన్నుజూచిన కొలంది మా చిత్తములు నీయందు దగుల్కొనుచున్నవి. మేము వర్తకులము. మాయొద్ద చాలధనమున్నది. విలువగలసొమ్ములున్న యవి. ఇవి యన్నియు నీ స్వాధీనము సేసెదము. అంతియగాక మాకు బెద్దపెద్ద మేడలున్నవి. నిన్ను గైకొనిపోయి యామేడలలో నుంచెదము. నీవు మా వెంబడివచ్చి సుఖములననుభవించుమ"ని పలికిరి. దమయంతి కర్ణకఠోరములగువారి వాక్యములవిని "అన్నలారా! యిదియేటి యన్యాయము! మీకు నావంటి తోడబుట్టువులు లేరా? వారితో మీరిట్లె ప్రసంగింతురా! మీరు నాయందిట్టితలపును వీడుడ"ని బదులు చెప్పుచుండ, నంతలో నావర్తకులొకరిపైనొకరు తగవులాడుకొని, యందరును గలిసి, దమయంతిని బలాత్కరింప నుంకించిరి.

## (26) వర్తకులు మదగజములచేత మరణించుట.

అంతట నా పరమసాధ్వి, వారి దురుద్దేశము లెఱింగి "అక్కటా! దైవమా! ఇదేటి యన్యాయము. రాచకులంబునబుట్టి రాజపత్నినై, సమస్తసుఖములను గోలుపోయి నా పవిత్రతనైన గాపాడుకొని దిరుగ నున్న నన్ను ఈదురాత్ములు ముట్ట నుంకించుచుండిరిగదా? సర్వేశ్వరా! నేను నీకేమి యెగ్గొనరించితినని నీలాటిదురవస్థల పాలుసేయుచున్నావు! అని పెనుశోకంబున నేడ్చుచుఁ బైటచెరంగుచే దనకన్నీటికాల్వలఁ దుడిచికొనుచు,

క॥ వారిచర బాధకోర్వక
వారించుము బాధనంచు వారణముతుగన్
వారక వారించితివా
వారణములనన్ను గావ బావన? శ్రీశా

క॥ ఒక్కతెను జూచిదుష్టులు
మిక్కుటముగనన్ను జెఱుప మీఱిరి, రావా
ముక్కడులను శిక్షింపవ
ఎక్కడ నీయునికి లేమి? శ్రీశ, దయాబ్ధీ.

క॥ ఎన్నో కడగండ్లైనవి
నన్నోకష్టరమందు జేర్చి, నమ్మకముమీఱా
నిన్నే గొలిచితి ననిశము
కన్నసుతగాన నేను కరుణాబ్ధీ హరీ.

అని మఱియుఁ బెక్కువిధంబుల భగవత్ప్రార్థనమ్ము సేయువఱకు నా యరణ్యమున నివసించు మదవారణంబులు, ఘీంకరణమ్ములు సేయుచు, నొకదానిపై నొక్కటి యురుకుచు నతివేగమ్మునఁ బఱతెంచి యావర్తకులపైఁబడి, వారలను దమపాదంబులతో మర్దించి, తొండములతో లేవనెత్తి నేలకుంగొట్టి చిత్రవధసేసి యమపురంబుసేరఁబంపెను. ఆవణిజు లెద్దులపై మూటలుగట్టుకొనివచ్చిన బియ్యము మున్నగుపదార్థములను బగులదిగిచి, యాకలిదీరభక్షించి, వ్రాలి యా దమయంతికి నమస్కరించిన చందంబున మోకాళ్లపై వ్రాలి లేచి తిరిగి తమ నివాసస్థానంబుల కరిగెను. ఆరేయియెల్ల దమయంతీదేవి యొక వృక్షరాజముక్రింద డాగియుండి, సూర్యోదయమై వెలుతురుగ్రమ్మినతోడనే రాజమార్గమును బట్టుకొని మెల్లమెల్లగ నడుగులిడుచు బోవసాగెను.

(27) దమయంతి సుబాహుపట్టణము జేరుట.

ఆ మార్గమునఁ గొంతదవ్వునకు బోవువఱకా వైదర్భికి మేడలును మిద్దెలునుఁగల నగరము కనుచూపుమేరలో నగపడెను. అప్పుడాయబల మనోధైర్యము తెచ్చికొని సాధ్యమైన వేగముతో నడుగులిడసాగెను.

అచిరకాలమ్మునన నామె యానగరపు రాజవీధిం బ్రవేశించి మనశ్శాంతితో నడుగిడుచుఁబోవుచుండెను. తత్పురవాసినులగు నారీమణులా సాధ్వీతిలకమును గాంచి "ఆహా! ఈ పుణ్యాంగన యెవ్వరు? ఏమి యీమె చక్కదనము? ఏమి యీమె యౌవనసౌందర్యము? మానవజాతిలో నిట్టి సుందరాంగి నెన్నఁడును జూచియుండలేదు. ఈమె కిన్నరకింపురుషాది దేవతాజాతులలో నుద్భవించిన యువతి గావలయును" అని తమలో తాము ముచ్చటించుకొనుచుండిరి. ఆ సమయమున సుబాహు మహారాజు తల్లి సౌధాగ్రమునఁ గూరుచుండి దారిఁబోవు దమయంతినిఁ జూచి "ఈ సుందరాంగి రాజలక్షణసమన్వితగా నున్నది. ఏ దువలననో కాలినడక నరుగుదెంచుచున్నది. సత్వరముగ నడిగి యామెనిందు తీసికొని రమ్మ"ని సుబుద్ధియను దాదిం బంపెను. సుబుద్ధి దమయంతికడ కేగి, దమయంతిని రావించి యా వృద్ధరాజ్ఞి సన్నిధిఁ జేర్ప నాసాధ్వి యామెకు నమస్కరించెను. రాజమాతయగు విమలాదేవి "నీ వృత్తాంతమేమని యామె నడిగెను. అంత దమయంతి చెలికత్తెను. నేనామెకు సుగంధద్రవ్యముల సంధానపరచుచుంటిని. నిషధేశ్వరుండగు నలుఁడు ద్యూతమున రాజ్యమును వోడి, పుష్కరునకప్పగించి, భార్యయగు దమయంతితో నరణ్యవాసము చేయఁబోయెను. పుష్కరుని కోపమునకుఁ జడి నా కిష్టము గాక యీపురికివచ్చితిని." అదివిని యా విమలాదేవి చాలఁ జింతించి "అమ్మా! ఆపద లెట్టివారికైన వచ్చును. నలదమయంతులు తిరిగి నిషధపురంబు చేరువఱకు నీవు నా చెంతనుండుము." అని చెప్పి దమయంతిని దనయొద్ద నిలుపుకొనెను. దమయంతి యా రాజమాతయొద్ద నేయుండి యామెకనుకూలముగ సంచరించుచు, దనపతి "నెన్నఁడు జూతునో"యని శ్రీమన్నారాయణుని బ్రతిదినమును ధ్యానించుచుండెను.

## (28) నలుఁడు దమయంతినిఁ దలఁచి దుఃఖించుట.

ఆ యయోధ్యాపురమున ఋతుపర్ణునియొద్ద గొలువుండి బాహుకనామంబున బిలువబడుచున్న నలుఁడు దినదినమును నుదయాత్పూర్వమున నిద్రమేల్కాంచి సుస్నాతుఁడై పాకశాలయందుఁ బ్రవేశించి, పరమాన్నభక్ష్యములను సిద్ధపఱచి ఋతుపర్ణునకుఁ గుడువఁబెట్టుచుండెను. ఋతు

పర్ణుడా పాక సౌష్ఠవమును, రుచ్యతనుగమనించి "యింద్రాదులకు సైతము దక్క నేరని యిట్టి వంటవాఁడు మనకు లభించుట మహాభాగ్యము" అని యానందించుచుండెను. ఒక్కనాఁడు, ఋతుపర్ణుడు భుజించినపిమ్మట నలుడును భోజనముసేసి, తాంబూలచర్వణంబుసేసి, ఫలహారముసేసి, మోసమునకు జింతపడనయ్యెను. నాఁటిరాత్రి యతడు నిండువెన్నెలలో సెజ్జనమరించుకొని, దానిపై బండి, తనసతియగు దమయంతిని, దలచి "అయ్యో ఎంతటికఠినుఁడను, క్రూరచిత్తుడను, నిరపరాధయగు సాధ్విని వనమ్మునల నొంటిగవిడిచితినిగదా! ఆమెయచ్చోట నేమయ్యెనో. పతినిగానక, వెదకివెదకి వేసారి ప్రాణములవిడిచెనో; ఏ క్రూరమృగముల వాతబడెనో! పుట్టినిల్లుజేరనొల్లక యెవ్వరిపంచనైన నిలచియుండెనో? అని పిచ్చివానివలె శయ్యపై నిదురింపనేరక యలత గొనుచుండెను. అట్టిసమయమున ఋతుపర్ణమహారాజు అతనిపలుకులనాలించి, కొంతతడవు విచారించి, "వెన్నెలలోన మగుపెట్టని బాహుకుడు నేడేలనో వెన్నెలలో శయనించినాడని భావించుచు, చాటుననుండి, నలుని పరితాప కారణము నూహింపజాలక సమీపమునకుబోయెను. నలుడు ఋతుపర్ణునిగాంచి తన కాంతానురాగసంభాషణము చాలించెను.

## (29) ఋతుపర్ణుడు నలుని బరిహాసము సేయుట.

"ఓయీ! బాహుకా! నీవు నీభార్యనడవిలో నేలవిడిచినావు? నీయందమునకుఁదోడు నీకొక భార్యకూడ ఉన్నదా! నీ యుద్యోగమునకు భార్యయు కావలసియున్నదా? నీ భార్యయేయున్నచో నామె నేల విడిచినావు? నీకు పొయ్యేదీపము, పొగయేధూపము, కట్టెపుల్లలే సెజ్జ, పాకశాలయేభార్య. ఇంతకన్న నేమికావలయును. మంచిది; యెట్టి కురూపికైనను భార్య కావలసియేయుండును. అది సహజము. అది నిజమైనచోఁ జెప్పుము. అందుకు దగినయుక్తిచేసి యామెను బిలిపించెదననెను. ఆ పరిహాసోక్తివిని, నలుడు, 'రాజేంద్రా! లోకములో నొకరాజుపడినకష్టములను, నతడు భార్యను విడిచినచందమును దలంచిన యట్లు పలికితిగాని, నా స్వవిషయముగాదు. నన్ను మీరు పరిహసించినచో

నేమియుఁ బ్రయోజనములేదు." అనిన విని ఋతుపర్ణుడానుడులు నిజమ్మనినమ్మి తన పడకటిల్లుసేరెను.

(30) విదర్భాధిపతి నలదమయంతులను వెదకించుట.

భీమరాజు నలదమయంతులు కానలకేగినారను వార్త విని, చింతానిమగ్నుడయ్యెను. అతనిభార్యయు కడుంగడు దుఃఖపడుచుండెను. ఒక్కదినమునఁ బురోహితునిరావించి వారి నన్వేషించి జాడదీసికొని రావలెననియుండెను. అతఁడు కృష్ణశర్మయను పేరుపెట్టుకొని ఎల్లపురంబులు పల్లెలుదిరిగి తుదకు సుబాహు నగరంబునకుజేరి యందలి పిన్నపెద్దలకు జాతకాదిఫలంబులఁజెప్ప నారంభించెను. ఇటులుండ నొకదినమున, సుబాహునితండ్రి యాబ్ధికమువచ్చినది. సుబాహుడు కృష్ణశర్మయను జ్యోతిష్కునిగూడఁ దీసికొనిరమ్మని బ్రాహ్మణులతోఁ జెప్పెను. బ్రాహ్మణులు కృష్ణశర్మను రాజగృహంబునకుజేర్చిరి. శ్రాద్ధసమయమున దమయంతి వస్త్రవులనందించుచుండఁ గృష్ణశర్మచూచెను. ఆమె సారూప్యము ననుమానించి దమయంతియే అయియుండవచ్చునని భావించి విచారపడెను. దమయంతియు నాటిని విచారమయముఖంబును గన్నీటిబిందువులనుజూచి, అతనిని దనతండ్రి పురోహితునిగా గుర్తించి తలుగొత్తి యేడ్చెను. ఆమె శోకమునువిని యా పురోహితుడు దమయంతినిగుర్తించి, విడిగాపిలిచి "అమ్మా! విదర్భదేశమునకు బోవుదము రమ్మ"ని హెచ్చరించెను. దమయంతి బిగ్గరగానేడ్చి "నాభర్త నెంత వెదకినను గనబడలేదు. నే నొంటరినై పుట్టినింటికెట్లుచేరగలనని కన్నీరు గార్చెను. ఈ దుఃఖమయప్రసంగములు సుబాహుడెఱింగి తల్లికిఁదెలుప నామెవచ్చి దమయంతిని "బాచి యమ్మా నేను నీతల్లితోడబుట్టినదానను. నన్ను గుర్తింపవా"యని చెప్పి యప్పటియామె వస్త్రములు దీసివేయుమనియు, నూతనవస్త్రములును నాభరణములును నిచ్చి వీనిని ధరింపుమనియు నెంత బ్రతిమాలినను దమయంతి వానినిధరింపక విచారగ్రస్తయైయుండెను. మఱునాడు సుబాహు నాదమయంతిని మునుగు పల్లకిలోనెక్కించి భటులను, సాయుధపాణులను వెంటనిచ్చి, భద్రముగా విదర్భదేశమున కంపించెను.

విదర్భదేశమునకు జేరగనే, తపనాభుడను భీమరాజుకుమారుడె దురుగవచ్చి దమయంతి నంతఃపురంబు జేర్చెను. దమయంతి తన వృత్తాంతమునంతయు దలిదండ్రులకు వినిపింపగా వారెంతయో దుఃఖించిరి. తపనాభుడు వారికెల్లఁ బకును ధైర్యము సెప్పి యూఱటగలుగఁజేసెను.

(31) భీమరాజు నలునివెదుక బ్రాహ్మణుల నంపుట.

అత్యంత చింతాక్రాంతుడై యున్న భీమరాజు బ్రాహ్మణులను రావించి "మీరు నాకుమాత్రైయగు దమయంతి చెప్పగుర్తులను మాటలను కర్తవ్యప్రకారంబును తెలిసికొని నలమహారాజును వెదకుటకై పోవలయునని యాజ్ఞాపించెను. వారు దమయంతీదేవిని గలియగా నామె "మీరు దయయుంచి యన్నిదేశములకు బోవలయును. ఇప్పుడు వారు క్రొత్తరూపమునముందురు. వారున్నతావున "దాను నన్నరణ్యములో డించి నిద్రవేళ వీడిపోవుటయు, కోకను నాలుగుమూరలచించి ధరించుకొనుటయు గుర్తుగా బ్రసంగించవలయును. వారుచెప్పిన ప్రత్యుత్తరములను బాగుగావిని, వారిపుడుండుతావును బురంబును, జక్కగా గుర్తెఱింగి రావలయును. ఇదియే మీరు నాకుచేయవలసిన యుపకారము." అని చెప్పి పలువుర బ్రాహ్మణులనంపించెను. వరువుసు పలుదేశములఁదిరుగుచుండ, వారిలో నొక్కరు డయోధ్యాపురమ్మునకు బోయి ఋతుపర్ణమహారాజు కొలువుకూటమున నిట్లని సంభాషించెను. "సభ్యులారా? నలమహారాజు సత్యసంధుడనియు, ధర్మతత్పరుడనియు బ్రసిద్ధికలదు. అతడు భీమరాజుకుమార్తెయగు దమయంతిని బెండ్లాడి, రాజ్యముగోలుపోయినవెనుక నరణ్యమునకుబోవుచు నామెందోడ్కొని పోయి, యొక పరస్త్రీరమున నిద్రించునప్పుడు కోకలోని నాలుగుమూరల ముక్క చించుకొని, దానిం దానుధరించి యా సుకుమారగాత్రిని ఘోర మృగసంకులంబయిన మహారణ్యమధ్యసీమను విడిచి యెందో తలదాచుకొనెను. ఆ నసులు నీతి, సత్యము, ధర్మము నెట్టివో విన్నారా? ఇంత దుర్మార్గప్రవర్తనులీభువి నింక నెవరైననుందురా?" ఆ దుర్భాషల నాలించిన ఋతుపర్ణుడు, "అయ్యా అట్లు దూషింపకుడు విధివశమున వచ్చిన యిడుమలందాటుటకు మానవుడెన్నోరీతుల సంచరించవలసి

యుండును. వారినింక దూషించుటమాని సెలవు గైకొనిపొండనిచెప్పి, కొలువుచాలించి లోనికిఁబోయెను. బ్రాహ్మణుడు సభాస్థలినివిడిచి బయటికి బోవుచుండ, నలుఁడాతనికడ్డముగావచ్చినిల్చి "విప్రపుంగవా! నలుడు భార్యయందుఁ బ్రీతిలేనివాడుకాడు. అతడరణ్యంబునఁజేరి భార్యను దల్లిగారింటికి జేరియుండుమనిచెప్పెను. ఈవార్త నాకానలుని వలనవింటిని. వానియందు దోషము నారోపింపకుము. మీరు మీనగరమ్మునకుబోయి సుఖంబుననుండుడు."అని నర్మగర్భితముగాఁబల్కెను.

ఆ పలుకులువిని యా భూసురోత్తముడు, శీఘ్రముగబయలుదేరి విదర్భాధీశునిచెంతకువచ్చి, "రాజేంద్రా! యీ యల్లుడు అయోధ్యాపురము నేలు ఋతుపర్ణునియొద్దనున్నట్లు తోచుచున్నది. దమయంతి చెప్పినప్రకారము నేను సభారంగమునఁ బ్రసంగించితిని. అయ్యెడ నొక్కఁడువచ్చి నలుని విధివశమున భార్యాసహితుఁడై యడవులచేరి, తనసాధ్విని బుట్టినింటికిఁబొమ్మని సెలవొసంగెనని నాకు నలునివలన దెలిసినదని చెప్పినాడు. మాఱువేషముననున్నను, నతఁడే నలుడుకావచ్చును" అని విన్నవించెను. ఆ విజ్ఞప్తిని విని భీమరాజు తన కులపురోహితుని రావించి వానివెంట బ్రాహ్మణులను అంతఃపురమ్మున నున్న దమయంతియొద్దకు బంపెను. దమయంతి యీ సమాచారము విని, గురూత్తమునకు నమస్కరించి, "అయ్యా, తాము అయోధ్యాపురమున కరిగి "దమయంతికి ద్వితీయ స్వయంవరంబని ఋతుపర్ణునకు తెలియజేసి యతడిచ్చటికి బ్రయాణమగునట్లు చేయుడు. ఋతుపర్ణుడొకడిచ్చటికి వచ్చునప్పుడతను సారథియై రాజురథముపై రాగలడు. అవలికార్యము నటుపై విచారింతము."అని యుక్తి చెప్పిపంపెను. బ్రాహ్మణులు అతిరయంబుగ నయోధ్యాపురమ్మునకు జేరిరి.

(32) దమయంతికి ద్వితీయ స్వయంవరమని యుక్తిప్రకటన.

అంతవారు ఋతుపర్ణుని కొలువుకూటమున బ్రవేశించి యనుమతిగొని "రాజేంద్రా! నలుడు జూదమునరాజ్యమోడి యడవులకేగి భార్యనందేవిడిచి, కట్టువల్వలేక దమయంతి కట్టుచీరనుండి యొక నాలుగు మూరల ముక్కనుకొనిధరించి యామెనుమోసగించి విడనాడి ఎందో

పోయెను. దమయంతి, తండ్రియగు భీమరాజునిల్లుంజేరెను. దమయంతికి ద్వితీయ స్వయంవరము సేయుట యుక్తమని పెద్దలు నిశ్చయించిరి. తమరు రావలయునని రాజబంధువులెల్లరు కోరుచున్నారు. ఆలసించక ఈ క్షణముననే బయలుదేరుడని హెచ్చరించిరి. ఋతుపర్ణుడు వారి పలుకులు విని యానందించి యప్పుడే బయలుదేరెను. ఇంద్రాదులను సైతము ధిక్కరించిన దమయంతి యీ స్వయంవరమున నన్నే కోరుకొనును. నాకే ప్రాప్తించును. ఆలసించినచో నేమగునో? యని చింతించి బాహుకునిబిలిచి "ఓయీ నీవు సారథ్యము సేయగలనంటివిగదా! నేను దమయంతి ద్వితీయస్వయంవరమ్మునకు శీఘ్రమున విదర్భకుబోవలయును. నీరథసారథ్యనైపుణ్యముజూపి శీఘ్రమున నన్ను విదర్భకుజేర్పుము నీ యుపస్కృతి మరువజాలనని బొట్టు వేడుకొనెను. నలుడా ఋతుపర్ణునరసి, రాజేంద్రా భయమందకుము. అన్యరాజన్యులెవ్వరును నచ్చటికి రాక మునుపే మిమ్మచ్చటికి జేర్పగలనని చెప్పి, యశ్వశాలకుబోయి చక్కని గుఱ్ఱములను రెంటిని దీసికొనివచ్చి, రథమునకుగట్టి ప్రయాణసన్నద్ధుడై యుండెను.

ఋతుపర్ణుడు దివ్యాంబరభూషణాదులధరించి, రథమునధివసించెను. నలుడు రథము నతివేగమున నడపించుతఱిని ఋతుపర్ణునిపై వలువ నేలకు జాఱి పడిపోయెను. "సారథీ; వస్త్రము క్రిందబడినది రథము నిలుపుము. తెచ్చెదననవుడు, నలుడు రథము నిల్పితినేని సమయమున విదర్భం జేర లేము. వస్త్రమునందో స్వయంవరమునందో ఆశవిడిచి, చెప్పుడనెను. స్వయంవరమే కావలెనని ఋతుపర్ణుడు సెప్ప, నలుడు రథమును వాయువేగమున నడపించెను. త్రోవలో నొక శమీకవృక్షము అభ్రంకషోత్తుంగశాఖాసమన్వితమై కనబడెను. రాజు దాని యాకులనెల్ల దూట్లుపడ శరప్రయోగము సేసెదను జూడుమని మంత్రోచ్చారణసేసి ధనుష్ప్రయోగము సేసెను. ఆ చెట్టునంగల యాకులకన్నింటికి రంధ్రములుపడెను. నలుడావృక్షముక్రిందనిలిచి, జరిగిన విషయమున కత్యానందభరితుడై యాశ్చర్యనిమగ్నుడై యట్టే పైకిచూచుచుండెను. అట్టియెడం గలి పురుషుడంతరిక్షముననిలచి, నలునకుమాత్రమగపడుచు, నల సార్వభౌమా! నేటితో నీదుర్దశతొలగిపోయినది. నేడు మొదలుకొని యిక

నీవు రాజ్యము నది గి యార్జించి భార్యాపుత్రాదులతో సుఖంబుగ నుండగలవు ఇదియే నా యాశీర్వాదమని చెప్పెను. కర్కోటకుడువచ్చి తొల్లి నలుని పాదమునం దాకినచోటునందిరిగి తాకి విషసంగ్రహము చేసికొనెను.

(౩౩) శనైశ్వరుడు నలునకు వరమిచ్చుట.

మఱియు నా సూర్యనందనుడు "ఓ, నలసార్వభౌమా ? సత్యధర్మ నిరతవ్రతా ! సద్గుణనిధీ ! నిన్నును నీసాధ్విని నొక్క కట్టుపుట్టముచే నుండ జేసితిని. కడకు మీ కు వియోగముగలుగం జేసితిని. రాజ్యభ్రంశము సేయించి, నిర్భాగ్యవంతునిగాం జేసితిని. దమయంతిని బరిచారికను జేయించితి, ఇట్టి ఇక్కట్టులబెట్టితినని నీవు నన్ను శపింపకుము. పతివ్రతా శిరోమణియగు దమయంతి నన్ను శపించి క్రుంగునట్లు సేయకుము. నీ సద్ధర్మ పరాయణత్వమునకు మెచ్చితిని, నీకుకావలసిన వరంబడుగుము. ఇచ్చెద" ననెను. "సూర్యనందనా ! నేను సూర్యవంశసంజనితుడను. మీరు సూర్యపుత్రులు. కావున మీరు నా కన్నలుగారు. నా విధివలన నాకీ కష్టములు గలిగినవిగాని మీరు నాకు బగతురై చేసినయపకారమేమియు లేదు. మీరు నాకొకవరమిచ్చెదనంటిరి గావున నా యభీష్టము చిత్తగింపుడు. "నాపేరు జగమ్మున స్థిరముగనుండునట్లనుగ్రహింపుడు. నరులు నా చరిత్రమును, వినినను, జదివినను, వ్రాసినను వారికిగలిబాధ కలుగకుండ వరంబొసంగుడు. ఈ శమీవృక్షముక్రింద నిలచినవారిపై దాము సోకకుండునట్లును ననుగ్రహింపుడు." అని కోరిన నలునకు నెల్ల వరమ్ముల నొసంగితినని పల్కి శనైశ్చరుడు నామాటలు సత్యములు నమ్ముము. నీవు కోరినట్లేయగునని వక్కాణించెను. ఇంతియగాక నీవింతటినుండి నిషధరాజ్యమును భార్యాసహితుడవై పాలించుచు సుఖంబుగనుండుమని యాశీర్వదించి నలుని దృష్టిపథమునుండి దూరగుడయ్యెను. అప్పుడు కలి నిలిచియున్న వృక్షమునకుం గలి వృక్షమని పేరు గలిగెను. అప్పటినుండియు జనులావృక్షచ్ఛాయ యందు నిలువక దూరముగ బోవుచుందురు. నలుని మేననుండి శనివదలిపోయినలోడనే యతని కెంతయో భారము దింపినట్లాయెను. శమీక పత్రములకన్నింటికిని దూట్లుపడియుండుట జూచి యాశ్చర్యపడి, రాజా నేను మీకు ఆశ్వహృ

దయమునెరుగు విద్యనుదెల్పెను. నాకు దమరట్టి బాణప్రయోగవిధాన మును దెల్పగోరెదనని పల్కెను. రాజుసమ్మతించి యితనికి బాణ ప్రయోగవిధానము దెల్పెను. నలుడతని కశ్వహృదయము నెఱుంగ విద్యనుగఱపెను అంత గ్రమ్మర ఋతుపర్ణుడు రథారోహణముసేసెను. నలుడు రథముదోల నారంభించెను. విదర్భపురంబునకు హయవేగమున జేరుచుండ నారథనిధ్వానమును, సౌధాగ్రముననుండి వినిన దమయంతి, విస్మయమంది యింత మహావేగమున నశ్వములనుదోలి రథమునడుపగల వాడు తనభర్తగాని యన్యుడుగానేరడనిగుర్తించి, పరమానందమున వారి యాగమనమును నిరీక్షించుచుండెను. మహామునుల వాక్యముల ప్రకారము మూడుసంవత్సరములు నిండెను. తనపతి దానుజేరగల కాలమువచ్చినదని దమయంతి యానందమున మంచిగడియ కెదురుచూచు చుండెను. ఋతుపర్ణునిరాక నెఱింగి, భీమరాజు సేనాసమూహముతో నెదురేగి స్వాగతమిచ్చెను. అంతఃపురమున నొక్క సౌధమున విడిదిచేయిం చెను. నలుడు రథాశ్వములనూడదీసి, యశ్వశాలకుంగొనిపోయి, మేతలు వేయించెను. రాజులెవ్వరును నప్పటికిరాకుండిరి. మఱునటిదినము రావచ్చునని తలంచి సమయనిరీక్షణము సేయుచుండెను.

(34) దమయంతి దాదులనంపి నలునిబరిశోధించుట.

పదంపడి దమయంతి "చతురయగుతనదాది నొక్కతెనుబిలచి "ఓసీ? యశ్వశాలలో ఋతుపర్ణుని సారథియున్నాడు. అతనివృత్తాంత మెఱింగిరమ్మని పంపించెను. ఆదాది మతికొందతితో యాతనింజేరి "అయ్యా మీరు మూడేండ్లనుంచి ఋతుపర్ణమహారాజు సారధిగానుంటిరి గదా? మీకీ వికృతరూపమెప్పుడుకలిగినది. మధ్యవచ్చినదా? లేక మొదటినుండియునుండెనా! మా భీమసేనమహారాజుగారి యల్లుడగు నలమహారాజుజాడ తెలియనందున "దమయంతికి ద్వితీయస్వయంవర మని యొక ఋతుపర్ణమహారాజునకు జెలిపి గారినిరప్పించిరి. ఋతుపర్ణ మహారాజుచెంతనే నలమహారాజుకలండని మునీశ్వరులుచెప్పిరి. రాజు వచ్చునప్పుడు, నలమహారాజునుగూడ దోడ్కొనిరావచ్చునని యిట్లు నేసిరి. నలమహారాజు దమయంతిని గాఱడవులనొంటరిపాటున విడుచు

టచే సిగ్గుననిందురానేరక యుండవచ్చుననియు, నీ స్వయంవరము నెపమున, రాజుతోపాటువారును రావచ్చుననియు నూహించిరి. ఋతుపర్ణమహారాజు తనయొద్దనున్న నలమహారాజును దోడతీసికొని రాక, యొంటరిగావచ్చిరి. మీరు నలమహారాజును గుర్తించియుందురు. దమయంతి కర్ధవస్త్రముమాత్రిముంచి, నిద్రాసమయమున మోసగించి పోయిన నలమహారాజునకు, నేటివరకుతనకై చింతాసాగరమున మునిం గియున్నా హారములుమాని, సరియైనవలువలుగట్టక నేలబండి కృశించుచున్న దమయంతిపై వారికి ప్రీతిలేదుగాబోలు. ఋతుపర్ణ రాజుతోబాటు తామిందులకురాలేరి." అని సంభాషించెను. మఱియొక చెలికత్తె పెరదాదులంజూచి "చెలులారా? నలమహారాజుగారిదే యీ యంతఃపురము, పుత్రమిత్రాదులువారివారు. మామగారు వారికను కూలురు వారిం దేలరారనెను. మఱియొకదాది పెరదాదులనుజూచి "అవును. నలమహారాజు దమయంతియందు దోషమెన్నియుండ వచ్చును. స్వయంవరకాలమున దేవతలనిరాకరించి తప్పుచేసినది. అడవులవిడువబడి, తల్లిగారియింటికిజేరి మఱొకతప్పుచేసినది. భర్త తన్ను విడిచిపోయినప్పుడు ప్రాణమువీడక బ్రతికియుండి మూడవతప్పు చేసినది. ఆయనదృష్టిలోనివియన్నియు దప్పులైయుండవచ్చును. కాని బిడ్డలయందలి ప్రేమచేతనైనను ఈతప్పులను మన్నించవచ్చునుగదా" యనెను. ఆ ప్రసంగములువిని నలుఁడు "అమ్మలారా! ఈ పలుకులు నామ్రోలనేలయాడెదరు. నేనొక రథసారథిని. ఒకని నౌకరిముందు ఈ ప్రసంగములుసేయ నేమిఫలము? నలుడు సద్బుద్ధితో దమయంతిని తల్లిగారియిల్లుచేరుమనిచెప్పి, తానొక్కడే యడవులనిడుమలుగుడు చుచు బోయినవాడుగదా? ఆతని నిందింతురేల. ఆతనిదేమితప్పు" అని ప్రత్యుత్తరముచెప్పి మఱియు, "మీరాడినపలుకులను ఋతుపర్ణ మహారాజునెదుటబలుకుడు. ఆతడే ప్రత్యుత్తరమొసంగును పొండని" వారినిబంపివేసెను.

దాదులు దమయంతికడకేగి యశ్వశాలలోని ప్రసంగములన్నియు నామెకువినిపించిరి. వానినిబట్టి యతడేనలుఁడని దమయంతిగుర్తించెను. వారిపలుకులు నూటిగానున్నవి. మీరు వానినిగుర్తింపలేకయే యేమో

ప్రతిభాషలొనరించి వచ్చితిరి. పోనిండు. మరల మీరు వారుచేయు వంటకంబులుచూచి కొన్ని పదార్థములు గొనిరండని పాకశాలకంపెను. దాదులంతట, దిరిగి పాకశాలకరిగి యానలునిచేఁ జేయబడిన పదార్థములు బహు పరిమళవంతముగానుండుట నరసిరి. వానిని దగురీతి స్తోత్రముసేసి "మా పడుచు రుచికరములైన పదార్థములు దినుటకలవాటు పడియుండి, మూడుసంవత్సరములనుండి వేనినొసఁగినను ముట్టకయున్నది. కావున నామెకొఱకింతయన్నము శాకాదులునిమ్మనివేడి, యొక పెద్ద తట్టలోనిడి యతఁడొసంగినయన్నము శాకభక్ష్యాదులుం గైకొనిపోయి దమయంతికిం దెచ్చియిచ్చిరి. దమయంతి వాని నారగించి తద్రుచివలనఁ బారవశ్యముచెంది తనభర్త యతఁడేనని నిశ్చయించెను అంత దన కుమారుని, కుమార్తెను బిలచి వారికి గొన్ని హితవచనములు, బోధించి, దాదులవెంట వారినశ్వశాలకు బంపించెను.

(౩౫) నలమహారాజు బిడ్డలనుజూచి చింతించుట

నలుఁడాపిల్లలనుజూచి యమితమైన విచారముచెంది యొడిపై గూర్చుండఁబెట్టుకొని శిరమ్మూర్కొని కన్నీరుగార్చెను. అట్లాపిల్లలనుజూచి దుఃఖింపనేలయనిదాదులడుగ "నలుడు నేనును నలునివలెఁ బుత్రకళత్రంబుల వదలివచ్చితిని. వీరినిజూడ నావారు తలంపునకువచ్చిరని యుత్తరముసెప్పెను. మఱియువారికచ్చటనున్న కండశర్కరయాతఁడొసంగి సెలవొసంగుచు "నాయిల్లిదికాకపోయెను. వీరికేమైననిచ్చిన బాగుండెడిదనిపరితపించెను." తరువాత దాదులుసారథింజూచి "అయ్యాచూచితిరా నలుడు ఇట్టిపిల్లలను, ఈపిల్లలతల్లిని, విడిచి, పరమకాఠిన్యమువహించి ఎందో దిరుగుచున్నాఁడు. వీరితల్లి యింక గొన్నిదినములుచూచి ప్రాణత్యాగ సేయ సిద్ధముగనున్నది. అప్పుడు వీరలగతి యేమగునో విచారించుడి" అని ప్రసంగింప "నాతడు మఱింత దుఃఖించి కన్నీరు నోటనొట్ట గార్చి తలవంచి మూర్ఛాక్రాంతునివలె మౌనముతో దిగాలుపడి కూర్చుండి శోకము నణచలేక యేడ్వసాగెను. దాదులాతనిజూచి తాము దుఃఖమాపుకొనలేక పిల్లలను దీసికొని దమయంతికడకేగి యశ్వశాలలో జరిగిన వృత్తాంతమంతయు సాంగోపాంగముగా వినిపించిరి. దమయంతి వారిమాటలువిని యతడేనలుడని రూఢిచేసికొని తడవు

సేయరాదని దనదండ్రిని బిలుపించుకొని "ఋతుపర్ణమహారాజుతో సారథియైవచ్చినవారే నాభర్త, కావున తడవుసేయక రావించవలయు ననిచెప్పెను.

(౮౬) భీమరాజు మంత్రులు నలునిసభకు దెచ్చుట.

విదర్భాధిపుడంతట దనమంత్రినిబిలచి "మంత్రిపుంగవా నీవు ఋతుపర్ణునియొద్దకుంబోయి మారాజునకు మీసారథిని జూడవలయునని కోర్కెపుట్టి వానిని దోడ్కొనిరమ్మనిపంపెనని దెలిప, యాతని సారథిని దోడ్కొనిరమ్మని సెలవొసంగెను. మంత్రి, ఋతుపర్ణునియొద్దకేగి, భీమరాజు నానతివినిపించి, సారథిని తమవెంటగైకొని కొలువుకూటము నకు వచ్చుచుండిరి. త్రోవలో నాసారథిని జూచినవారలెల్లరు, ఇతడే నలుడుకావచ్చునని పోల్చిరి. స్త్రీ జనమ్ములు తమలోతాము "అక్కలారా! వింటిరా నలుడిల్లు భార్యాపుత్రులనువీడి యేగెను. భార్య నొంటరిగా విడువనేల? తానొంటరిగాదిరుగనేల? విధివశంబున రాజ్య ముపోయినను, మామగారింట నేమిలోపమున్నది? మూడు సంవత్సరము లకు నలమహారాజు రాగలడని యడవిలో దయమంతికొకముని చెప్పె నట. ఆ గడువుతీఱినది. ఇంక నేతడు రాగలడు. రానిచో దమయంతి యింక, జీవముల ద్యజింపకమానదు. ఈస్త్రీ హత్యాపాతకమెవ్వరికి దగులునో తెలియదు. ఇప్పటికీవిషములు ఆయుధములు మున్నగు వానిని, నామెకందనీయక భద్రపరచియుంచిరి. బావులకడ భటులను గావలియుంచిరి." అనియు నింకఁ బరిపరివిధమ్ముల దమలో ప్రసంగించు కొనిరి. ఆ పలుకులెల్లఁ జెవులకు ములుకులుగాదోచుచుండ నలుడు మెల్ల మెల్లగ సవిచారముగ నడచుచు భీమరాజు కొలువుకూటమునకు బోయెను. భీమరాజు సింహాసనముదెప్పించి యాయాసనమలంకరింపు మనెను. అంతటనాసారథి "రాజేంద్రా! నేనీయాసనమునగూర్చుండ నర్హుడనుగాను. రాజరాజునుగాను, మీ బంధువునుగాను, మీ యల్లు డనుగాను. స్వయంవరమునకై వచ్చిన ఋతుపర్ణమహారాజు రథము నడపువాడను. ప్రయాణాయాసముచే మేనుబడలియున్నది. పోయివచ్చె దను సెలవొసంగుడ"ని మఱచిపోవుటకుసిద్ధపడెను.

## (37) దమయంతిబిడ్డలను నలునికాళ్లపైవైచి దుఃఖించుట.

అంతలో దమయంతి పిల్లలనుదీసికొనివచ్చి నలునికాళ్లపైవైచి,
తానును గోడుగోడున "దైవమా? యెంతవైపరీత్యమైనది? మామృదు
హృదయమునకింత కాఠిన్యమేలవచ్చినదని కన్నీరుమున్నీరుగాగార నేడ్వ
సాగెను" సారథి యవియెల్లఁజూచి "రాజా నన్నేలరావించితిరి?
ఈమెయేల యేడ్చుచున్నది. నాకుసెలవొసంగుడు నేనుశీఘ్రముగ
బోవలయుననిపల్కెను. మఱియు దమయంతినిజూచి "రాజకుమారీ,
నీ వేలశోకించెదవు? నీతండ్రినీకు ద్వితీయస్వయంవరముసేయింపనున్నారు.
నీచింతలన్నియుదీరగలవు. మిన్నకుండుమని నామాటవలన నీతండ్రికి
నాయందుగోపముగలుగును. నేనుబోయెదనని లేవబోయెను.

భీమరాజు అతడేనలుడనిగుర్తించి యాతనికరములఁబట్టుకొని
సింహాసనముపైఁగూర్చుండబెట్టి, బిడ్డలను దొడలపైనుంచి, నాసుతనువిడ
నాడిన నీవు ఋతుపర్ణునియింటనుండుటనువిని దీర్ఘముగనాలోచించి,
ద్వితీయస్వయంవరమని యొక్కఋతుపర్ణునికే తెలిపి నీవిందువచ్చునట్లు
చేసితిని. మఱెవ్వరును రాజులురాకుండుటయే యిందుకుసాక్ష్యము.
నీవురావలయునని చేసిన మిషాప్రకటనగాని, స్వయంవరార్థముచేసినపని
గాదు. నేమమునునీతితప్పి నడచువాడనుగాను. ఇది నేరముగాదోచినచో
మమ్ముమన్నించగలవు." అని వేడుకొనెను. అంతటనలుడు పిల్లలనూ
దార్చి దమయంతివంకదిరిగిచూచి, "రాజపత్నీ! జగమ్మున మానవులకు
గష్టములువచ్చుట సహజము. గడుపరానియాపదవచ్చిన కారణమున
నలుడు నినువీడియేగినవాడు అతనిని దిరిగిస్మరింపనేటికి? అతడేకావల
యునను మనోనిశ్చయమేటికి? నలునకుసమానులైన మానవులు ప్రపంచ
మునలేరా? అట్టిపగతునియందు నీవుమనస్సుంచుకొననేల. నీతండ్రినేనే
నలుడనని వాకొనుచున్నారు. నలునియందిట్టి క్రూరవృత్తి తొలుతనే
కనుగొన్నచో నీవు వివాహమాడకుందువుగదా! కాననమ్మునకేగు
నప్పుడు వెంటరావలదనిచెప్పినను వినక వెంబడించితివి. అడవుల
యందు గాయకసువులదిని జీవింపనేరవు, నీవు విదర్భకుబొమ్మని
చెప్పినను వినక వానినేవెంబడించితివి. నీవు వినవైతివిగదాయని

యాతడు నిన్నొంటిపాటునవిడిచిపోవుట తప్పుగాదలంచి, యిప్పుడు ద్వితీయస్వయంవరమునకు బ్రయత్నపడితివి అట్టి నిన్నుదిరిగి గైకొనుటకు నలుడుమాత్రము సిగ్గుపడడా ? నీవలెనేయతడును మఱియొకవివాహ మాడుటకు బ్రయత్నించుచున్నట్లువింటిని. నలుడు శోకస్థుడగుటచే ద్వితీయ వివాహమునకు బ్రయత్నించియుందువు. కాని పిల్లలనుజూచియైన నా ప్రయత్నము విడువగదా? నేననవలసిన నిమిత్తమేమియు లేదు. నీతండ్రి నేనే నలుడనగుటవలన నింతవాదము సేసితిని. నాకు గలహ ముతో నిమిత్తములేదు." అనిపలికెను. అయ్యెడ దమయంతి యాతడు కట్టిన చిన్నవలువ తనచీరలోనితునకయగుర్తించి, అది కడుంగడు మాసియుండుటయుజూచి, "దుఃఖమాపుకొనజాలక మొఱగత్తియేడ్చుచు జేతులెత్తి నెత్తిన మోదుకొనుచు, దైవమా! నాపతికిట్టిముఱికివస్త్రపు చింపినిచ్చి దానితోగాలముబుచ్చుమంటివాయనెను. పతినిజూచి, ఓ రాజేంద్రా! ప్రాణనాథా! అనాథనురక్షింపుము. మీరు విడనాడినది మొదలుకొని మీయందేమనస్సుంచి తదేకధ్యానమున రేయింబవళ్లు గడపితినిగాని, మఱియొకవివాహము నాశించినదాననుగాను. ఈక్షణము వఱకును మిమ్ములనేపతిగను దైవముగనుభావించి మీయాగమనము నకు నిరీక్షించుచుంటినిగాని, యన్యోద్దేశములేదు ఈమనస్సు మఱియొక సంకల్పమొక్కత్రుటికాలమైనను జేసియుండలేదు. ఇందుకుసాక్ష్యముగ, భూదేవియు, ఆకాశవాణియు, అగ్ని, వాయువునున్నగు అష్టదిక్పతులును, సూర్యుడు చంద్రుడు నక్షత్రములును జూచుచున్నారు. నేనేక్షణమున నైన నన్యచింత మొనర్చియుంటినేని, బ్రహ్మహత్యాపాతకమును, పతి ద్రోహపాతకమును, సువర్ణాపహరణపాతకమును, పిశునతాపాతకమును, కూటసాక్ష్యకథనపాతకమును, దైవద్రోహ మహాపాతకమును గో స్త్రీ శిశుహత్యాది సమస్తపాతకములును నన్నుబట్టియేర్చగలవు. మీకింకను సంశయముపొడదేని, నేనగ్నిమధ్యమునంబ్రవేశించి, మీపావనసన్నిధికి జేరెదను. అప్పుడైనను నన్నాదరింపవలయును. అని కేల్మోడ్చినిలువం బడెను. దమయంతి తలిదండ్రులును నామె అన్నయగు తపనాభుడును, నలునిచెంతకుజేరి ముఖములెత్తిబారంగన్నీరు గార్చుచు మిక్కిలి దుఃఖింప సాగిరి.

(38) బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమగుట.

ఆ సమయంబున రాయంచనెక్కి నలువయు, గరుడనిపైనధివసించి వెన్నుడును, నంది నెక్కి శంకరుడునువచ్చి నలసార్వభౌముని మ్రోలనిలువంబడి "రాజేంద్రా! దమయంతి మహాపరిశుద్ధురాలు. ఆమె యందు కళంకములేదు. ఈ పుణ్యశీల, నీవు విడిచిపోయినపిమ్మట ప్రాణత్యాగమును జేయుటకు సిద్ధపడినప్పుడు మేము ఈమెను గావుదలచేసి రక్షించితిమి. ఇంక నీవుపుత్రికళత్రములనుగ్రహించి నీవు సుఖంబున నుండుము. తిరిగి నీవు పుష్కరునితో ద్యూతమాడుము. అందునీవు జయించి గడియకాలమున నీ రాజ్యమును స్వాధీనము సేసికొందువు. చిర కాలము రాజ్యపాలనము సేసి ధర్మరక్షణము సేయుము. ఇదిగో నిన్ను మాప్పతిప్పలంబెట్టిన కలిపురుషుడు. నీపజ్జనే యితడు సిగ్గునదలవంచుకొని నిలిచియున్నాడు. కర్కోటకుడిచ్చటనున్నాడు. ఇతడు నీనిజరూపము నిచ్చుటకు సంసిద్ధుడై యున్నవాడు. కావున నీవు నీపూర్వస్వరూపమును బొంది పత్నీసహితుడవై సుఖంబుననుండుమని నొడివిరి. నలుడు వారు ముగ్గురకును నమస్కరించి పలువిధంబుల స్తోత్రధ్యానములుచేసి నిలువంబడియెను. కర్కోటకుడు మిగుల భయభ్రాంతులజెంది, తన విషజ్వాలల నణచుకొని, శాంతస్వరూపముతో నలునిందిరిగిస్పృశించి యతని వికృత స్వరూపమును గ్రహించికొనెను. నలుడప్పుడు చంద్రబింబమువంటి ముఖకాంతియు. సూర్యకాంతివంటి తేజస్సును, బొంది భూలోకమునకు దిగివచ్చిన దేవేంద్రుని సౌందర్యమునం బ్రకాశించెను. దేవతలెల్లరు నలదమయంతులజేరి "మీరుభయులునుగలిసి యెప్పటియట్ల దాంపత్యానురాగమును గలిగి, ప్రజాపాలనము సేయుచుండుడని యాశీర్వదించి యంతర్ధానమైరి. నలుడు భార్యాపుత్రులతో నిషధనగరమునకుబోవ సిద్ధమయ్యెను.

(39) ఋతుపర్ణుడు నలమహారాజును క్షమాపణ వేడుకొనుట.

ఈ విచిత్రాంశములన్నియు విని ఋతుపర్ణమహారాజు విస్మయమంది, చిత్తభ్రమనొంది, చేతులుమోడ్చి నలునిమ్రోలనిలువంబడి

"ఓ నలసార్వభౌమా! మిమ్ము నెఱుంగక మోసపోయితిని. మిమ్మెన్నో దుర్భాషలాడియుందును. నాయందెన్ని దోషములున్నను మన్నింపవలయు"నని ప్రార్థించెను. ఆతనిమాటలువిని నలుడు, రాజేంద్రా! నీవు పుణ్యమూర్తివి. నీవంటిపుణ్యపురుషుడీజగంబున నుండుటం జేసి, నీచెంతనుండి, నావ్రతమును నెఱవేర్చుకొంటిని. నీయందేదోషమునులేదు. సెలవొసంగుము, నేనింక నిషధరాజ్యమునకేగెదనని యనుజ్ఞగైకొనెను. భీమరాజు నలదమయంతులను దిరిగి యొక్కటిసేసి యింద్రసేనను, నింద్రసేనునివారికప్పగించి, అమూల్యరత్నాభరణాదులొసంగి, వారిని నిషధదేశమునకంపెను.

## (40) నలుడు పుష్కరునితోజూదమాడి గెల్చుట.

నలదమయంతులు తమసంతతితో నిషధదేశమున ప్రవేశించిరి. నలుడు పుష్కరునియొద్దకుబోయి, దైవసంకల్పానుసారముగా "రాజా! కపటద్యూతమున నారాజ్యమును గెల్చుకొంటివి. తిరిగి యిప్పుడు నాతో ద్యూతమాడుమని పౌరుషంబుట్టి పడంబల్కెను. పుష్కరుండిపుడేమి పందెముపెట్టెదవని నలునడిగెను. నలుడు ఇప్పుడు నాభార్యను బందెముగా నిడుచున్నాననెను. దమయంతి మహాసౌందర్యవతియగుటచే, రాజ్యముతోబాటు దమయంతియుం దనస్వాధీనము కాగలదను దురాశతోం బుష్కరుడు మహాసంతోషమున ద్యూతమునాడం బ్రారంభించెను. క్రమక్రమముగా బందెములొడ్డుచు, బుష్కరుడు, అంతఃపురమును, సౌధములను, రథగజాశ్వములను, సభామంటపములను, సమస్తరాజ్యమునునోడి, కట్టుపుట్టముతో నిలిచెను. తుదిపందెమున బుష్కరుడు తనకట్టుపుట్టముసైతము ఓడనాయెను. అపుడు పుష్కరుడు కౌపీనధారియై నలునియెదుటనిలిచి చేతులుజోడించి ఇంకనేంబోయెదను సెలవొసంగుమనెను. నలసార్వభౌముడు, మహాధర్మశీలి, యంత నాపుష్కరునిజూచి "నృపాలా? కాలము ఒకరిపాలుకానేరదు. జయాపజయములు దైవాధీనములు, నీవు నన్నోడించినపిదప నేను భార్యతోగూడ నీయూరిబైటి సత్త్రిమునజేరి మూడుదినములుంటిని. అన్నపానాదులులేక మేముపవాసముంటిమి. అట్టియెడ నీవు పురజనులయందొక్కరిని మాయొద్దకు

రానీక యమ్మనుపవాసమున దహింపజేసితివి. ఈయన నిట్టి దురభి మానమును మనస్సులోనుంచకొనక లేనివారిపట్ల గనికరముతో మెలంగుము. నీవలెనేయితరులును నుందురని యోజించుకొనుము. పుణ్యము సంపాదించుకొనుము దుష్టబుద్ధిని లోకాపకారకబుద్ధిని విడువుము" అని హితబోధసేసెను. మఱియు నలసార్వభౌముడు పుష్కరునకు కలసినంత ధనమును, జీనిచీనాంబరములను రత్నఖచిత సువర్ణాభరణములను నొసంగి, స్వనగరమ్మునకు బంపివేసెను. పుష్కరుడానందించి నలుని దయాళుత్వ మునకు మెచ్చుకొనుచు నిజపురంబునకు బోయెను.

## (41) నలుడు తిరిగి పట్టాభిషిక్తుండగుట.

వెంటనే నిషధదేశమునందంతటను విజయలక్ష్మివిహారము సేయ దొడంగెను. మంత్రిసామంతాదులు పౌరులు నగరమునెల్ల పచ్చనివందిళ్ల తోడను, మకరతోరణములతోడను నలంకరించిరి. సుముహూర్తమున నలదమయంతులు తిరిగి తమసంతానముతో నంతఃపురప్రవేశముసేసిరి. బ్రాహ్మణాదులకను బీదవాండ్రకును గోభూహిరణ్యాదానంబులుసేసి జగత్సంతోషముసేసిరి. మంత్రిసామంత పురోహితాభిమతానుసారముగ దిరిగి రాజ్యాభిషిక్తుండై నలమహారాజు దారాపుత్రులతో నిషధరాజ్య మును ధర్మసమ్మతముగఁ బరిపాలించుచుండెను. ప్రజాసముదాయమును, మంత్రి పురోహితాదులును సార్వభౌమునిమోల్ల నిలచి "దేవా! ఇన్ని దినమ్ముల న్యాయాన్యాయ పరిశీలనమెఱుంగని పుష్కరుని సేవాబంధము నుండి మాకు నేడు విమోచనముగలిగినది. తమ యాగమనమునను దమరాజ్య పీఠాలంకారమునను మాకుఁ బరమానందమైనది" అని మనవి చేసిరి. వారి సవినయప్రసంగము నాలించి నలసార్వభౌముడు, "ఓమంత్రి సామంతులారా! కాలచక్రము సంభ్రమించినకొలది మానవులదశలయం దనేకములగు మార్పులు గలుగుచుండును, కలిమాయచే జిక్కుపడి పరితాపంబునంబడితిని. ఇప్పుడా, కలి, నన్నొదలియై రక్షు.. సేయు నారం

భించెను, అందువలన నిపుడు సర్వసౌఖ్యములును సమకూడినవి. శ్రీమన్నారాయణమూర్తి కృపచే నికముందు మనమెల్లరము తొలుతటిరీతిగ సుఖంబనుభవించెదము గాక. యని ప్రోత్సహించెను. ఏబదియైదుగురు సామంతరాజులును, పట్టాభిషేకసమయమునకు దాము దెచ్చినకానుక లన్నియు నలసార్వభౌమున కర్పించి, యొండొరుల క్షేమములను విచారించుకొని పరమానందంబున వారివారిదేశములకు బోయిరి.

## (42) బృహదశ్వుడు ధర్మరాజునకు హితము సెప్పుట.

అట్లు నలునివృత్తాంతమునంతయు జెప్పి, బృహదశ్వమహాముని ధర్మనందనునిజూచి, పాండవాగ్రజా! నలుడు నీతోసముడైనవాడు. ఆనలుడు తన యిడుమలనుండి విముక్తుడయినట్లు నీవును నీయిక్కట్టుల నుండి విమోచనమనొంది, బంధుమిత్రాదులజేరి సుఖంబున నుండగలవు." అని విశ్వాసముగుదురంబల్కి సెలవుసెప్పి, నిజనివాసంబున కరుగుదెంచెను.

బృహదశ్వుని ఆశీర్వాదముప్రకారము ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపదియు పండ్రెండుసంవత్సరము లరణ్యవాసము పూర్తిసేసి, ఒక్కసంవత్సర మజ్ఞాతవాసముసేసి, కౌరవులజేరి యర్ధరాజ్యమునిమ్మని యడిగిరి. దుర్యోధనాదులు అర్ధరాజ్యము నీయనిరాకరించిరి. అంత శ్రీకృష్ణదేవుని సాహాయ్యమున, కౌరవులను దునుమాడి, హస్తినాపురంబునబ్రవేశించి, రాజ్యభారమునుగైకొని, నిరాటంకముగ రాజ్యపరిపాలనముసేయుచుం జిరకాలమిష్టోపభోగంబు లనుభవించుచు సుఖంబుననుండిరి."

ఇట్లు వైశంపాయనమహర్షి జనమేజయ జనపాలునకుం జెప్పిన ప్రకారము, సూతులు శౌనకాదిమహర్షులకు వచించిరి.

## (43) గ్రంథమాహాత్మ్యము.

ఈ నలచరిత్రము భూలోకమున సహృదయులకు కర్ణభూషణమై యాచంద్రతారార్కముగ బ్రకాశించుగాక. ఈనలచక్రవర్తి చరిత్రము, జదివినను, వ్రాసినను, జదివించినను, వ్రాయించినను నలునిస్మరించినను అట్టిమానవులను నవగ్రములుపీడించవు. కలిమాయ వారిని బాధింపదు. దేవతనెల్లరు వారి నను గ్రహదృష్టితో జూచుచుందురు. ఈనలసార్వభౌముని నామస్మరణముసేసినను నరులకు శనైశ్చరునివలననేబాధయుగలుగక శుభములే గలుగుచుండును.

మంగళం మంగళం.

శ్రీ నలచక్రవర్తిచరిత్రము వచనకావ్యము సర్వము

సంపూర్ణము.

